

మేకల కాపరి —ఫొటో : పి. సి. ఎమ్. ఈశ్వర బాబు, మద్రాసు.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.



సంపుటము 46
సంచిక 6
14.10-53

సచిత్ర వారపత్రిక
Founder : K. NAGESWARA RAO

విజయ ఆశ్వయుజ శుద్ధ షష్ఠి బుధవారం

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : బొమ్మలపెండ్లి.



**ఈ సంవత్సరం దసరా బహుమతులు పొందినవారు:**

1. మంచిబొమ్మకు - చిరంజీవి యస్. యెల్లారెడ్డి (15), గవర్నమెంటు హైస్కూలు, సిద్దిపేట, హైదరాబాద్. (32, 33 పేజీలు)
2. మంచి పాటకు - చిరంజీవి బొమ్మకంటి ఆండాళ్ తాయారు (12), మద్రాసు. (8 వ పేజీ)
3. మంచి కథకు - చిరంజీవి త్రిపురనేని ప్రమీలకుమారి(14), మద్రాసు. (9 వ పేజీ)
4. ముఖచిత్రానికి - చిరంజీవి కిళాంబి రాజకుమారి (8), మద్రాసు.

## ఒక మాట

గత సంవత్సరం దసరాపండగకి చేసినట్లే ఈ సంవత్సరంకూడా బాల బాలికల రచనలలో పోటీలు ఏర్పాటుచేసి, పిల్లల ప్రత్యేక సంచిక వెలువరుస్తున్నాము. ఈ ఏడాదికూడా ఇందులో అనేకులు బాల బాలికలు అత్యుత్సాహంతో పాల్గొనడం మాకు చాలా ఆనందం కలిగిస్తోంది. ముఖ్యంగా ఎందరో ఆడపిల్లలు బొమ్మలు, కథలు, పాటలు పంపించారు. మగపిల్లల్లో కంటె ఆడపిల్లల్లో రచనోత్సాహం, సామర్థ్యం వెల్లివిరుస్తోందనడానికి నిదర్శనంగా, కథ, గేయం, ముఖచిత్రం బహుమతులు ఆడపిల్లలే గెలుచుకున్నారు. కిందటేడాదికీ, ఈ యేడాదికీ మరొక పెద్దతేడా యేమిటంటే, ప్రచురించడానికర్హమైన రచనలు బాలబాలికలే కావలసినన్ని పంపించడంచేత, ఈమారు పత్రిక అంతా - కొన్ని వ్యాసాలు, ఒకపాట, అండర్సన్‌కథ, ఫొటోలు తప్ప - బాలరచనలతోనే నిండింది.

బొమ్మలు అసంఖ్యాకంగా వచ్చాయి. తెలుగుదేశంలో బాలబాలికలకు చిత్రరచనలో ఇంత ఆసక్తి, అభిరుచి ఉండడం చూస్తే, ముందుతరాల్లో ఆంధ్ర చిత్రకళ మరొక "అజంతా"ను సృష్టిస్తుందేమోననే తియ్యటి ఆలోచనలు కలుగుతున్నాయి.

మాకు పంపినచిత్రాలూ, రచనలూ అన్నీ స్థలాభావంవల్ల ప్రచురింపలేకపోయినందుకు చింతిస్తున్నాం. మిగిలిపోయినవాటిలో అర్హమైన రచనలను క్రమేణా వారపత్రికలో ప్రచురింపగలము. ఈ రెండేళ్లలోను బాలబాలికలు చూపిన ఉత్సాహాన్ని గమనించి ఏటేటా ఈమాదిరి రచనల పోటీలు జరపాలని నిర్ణయించాము. ఈ పోటీల్లో పాల్గొని మా కార్యక్రమాన్ని జయప్రదం గావించిన పిల్లలందరికీ మా ఆశీస్సులు.





అయ్యవారికి చాలు అయిదు వరహాలు; పిల్లవాళ్ళకు చాలు పప్పు బెల్లాలు.

చిత్రకారుడు: కొంపెల్లి గోపాలకృష్ణమూర్తి (15) కాకినాడ.

# విజయదశమి

వేడేపల్లి శంకరం (13)
(బొంబాయి.)

"జయీభవ! విజయీభవ!!" అంటూ పిల్లల గుంపులు మా వీధిలోకి వచ్చారు. బళ్ళోకి కెడుతూ వీధిగుమ్మందగ్గర కొంచెం సేపు ఆగి వాళ్లంతా వెళ్లిందాక చూసి, తరువాత బళ్లోకి వెళ్లేను.

బడి గుమ్మములో అడుగు పెట్టేనో లేదో, వెంటనే గంట గణగణ మ్రోగింది. బైట వున్న పిల్లలందరూ గోల చేసుకొంటూ వాళ్ల వాళ్ల క్లాసుల్లోకి వెళ్ళి కూర్చొన్నారు. నేను కూడా నా క్లాసులోకి వెళ్లి కూర్చొన్నాను. నాకు ఎదురుగావున్న బెంచిమీద భాగ్యం, లలిత, లీలావతి కూర్చొన్నారు. రఘురామయ్య మేష్టారు వచ్చి, కుర్చీలో కూర్చొన్నారు.

ఎదురు బెంచీలో కూర్చొన్న లలిత, లీలావతిని పిలిచి "మీ ఇంట్లో బొమ్మలకొలువు పెట్టేరా?" అంది మెల్లగా. 'లేదం'ది లీలావతి. పక్కన కూర్చున్న భాగ్యం గభీమని "మా యింట్లో చాలా పెద్దకొలువు పెట్టేమే లీలావతి! నిన్ననే పెట్టేం. స్కూలు వదిలాక యింటికి వెళ్లేటప్పుడు మీరిద్దరూ మా యింటికి వచ్చి తాంబూలం తీసుకొని వెళ్లం" డంది, లీలావతిని మెల్లగా చేతితో తట్టుతూ. వాళ్ల సంభాషణంతా వెనక బెంచీలో కూర్చొన్న నేను వింటున్నాను.



నేనూ - మా తమ్ముడు
మారెడ్డి లక్ష్మి, (10) నార్యాపేట.

మా యింట్లో ఎవ్వరూ ఆడపిల్లలు లేరు. మా తల్లితండ్రులకి నేనొక్కడినే సంతానం. మాఇంట్లో నవరాత్రి తొమ్మిదిరోజులూ దేవీ పూజలు చేస్తారు. మా చుట్టాలందరూ అన్ని వూళ్లనించి మా యింటికి వస్తారు. సాయంత్రము పొద్దునాకూడా లలితా సహస్ర నామాలతోటి దేవికి కుంకుమ పూజలు చేసి, ఆరాధిస్తారు; వేద పారాయణం జరుగుతుంది. బ్రాహ్మణులకి దక్షిణ తాంబూలాలుయిచ్చి, పిండి వంటలతో దేవి మహానివేదన చేసి తరువాత దేవి ఆశీర్వాద ప్రసాదమును అందరూ స్వీకరిస్తారు. అది కాక మా అమ్మ దేవిపూజా ముంది

రానికి ఒకప్రక్కగా దేముడు గది లోనే వెండిబొమ్మలతో ఒక చిన్న కొలువుకూడా పెడుతుంది, "ఈవేళ సాయంత్రము మీరు ముగ్గురు కూడా మా యింటికి రండి సరదాగా చూడచ్చు" అన్నాను.

నా స్నేహితులైన లీలావతి, లలితా, భాగ్యం, మేమందరం కూడా ఒకే యీడువారమే. ఒక వీధిలోనే యిరుగుపొరుగున వుంటున్నాం కూడాను. నాపేరు రాము. మావూరు పట్నవాసమూ కాదు, పల్లెటూరూ కాదు. అందుచేత మా వూళ్లోకూడా స్కూళ్లలో దసరా పండక్కి పిల్లలందరిచేతా గిలకలు పట్టించడము గిలకల పద్యాలు పాడించటం, అందరిండ్లకు వెళ్లి పప్పు బెల్లాలు తెచ్చుకోవడం ఆచారంగా వుంటున్నది. అదేప్రకారము యీ సంవత్సరం కూడా జరుపుదామని మేష్టర్లందరూ మాకు చెప్పేరు. కుర్చీలో కూర్చున్న మేష్టారు నోటికి ఫుల్ స్టాపు లేకుండా హిస్టరీ పాఠము చెప్పకు పోతున్నారు. ఆయన చెప్పే పాఠము ఆరోజున కేవలం గోడలు, కిటికీలే వింటున్నాయి. అంతకు మినహా మాక్లాసు పిల్లలెవరి చెవుల్లోనూకూడా ఒక అక్షరమైనా దూరటం లేదు.

అప్పటికి పీరియడు అయిపోవడానికి యింకా 10 నిముషములే వుంది. అంతట్లో ఎట్టిటి అట్టగల పొడుగాటి పుస్తకం ఒకటి ప్యూన్ తెచ్చి మేష్టారు చేతికిచ్చేడు. మా మేష్టారు దాన్ని తీసుకొని, తన సంతకముపెట్టి "పిల్లల్లారా రేపటి నుంచి 3 రోజులు దసరా సెల



రాధాకృష్ణులు
చిత్రకారుడు: పి కె. సుబ్రహ్మణి, సికిందరాబాదు.

# దసరా పాట

యస్. కోటి (శ్రీకాకుళం)

పండుగ, పండుగ
దసరా పండుగ—
దసరా పండుగ ఎవ్వరికి ?
బడిలో కెళ్లే బాలురకి !

పూజలు, పూజలు
సరస్వతి పూజలు—
సరస్వతి పూజలు ఎవ్వరికి?
బుద్ధిగ చదివే పిల్లలకి !

కట్నాలు, కట్నాలు
దసరా కట్నాలు—
దసరా కట్నా లెవ్వరికి ?
చదువులు చెప్పే పంతులుకి !

పళ్లూ, కాయలు
పప్పూ, బెల్లాల్—
పప్పూ బెల్లా లెవ్వరికి ?
పద్యాలు చదివే బాలుంకి!

జేజేలు, జేజేలు
దసరా జేజేలు—
దసరా జేజే లెవ్వరికి ?
ఈ పాటను చదివే పెద్దలకి !

# దసరా బొమ్మలు

శ్రీనివాస కాశ్యప (మద్రాసు.)

బొమ్మలమ్మ బొమ్మలూ
రంగు రంగుల బొమ్మలూ!
బంగారూ బొమ్మలూ
బలే బలే బొమ్మలూ.

* * *

దసరాకీ సరదాకీ
బొమ్మ లెన్నో పెడతామూ
అందులో మాచిట్టి పాప
నొక బొమ్మగ జేస్తాము.

* * *

చిట్టిపాప చిరునవ్వులో
చిట్టి పూవు లెన్నెన్నో—
విరిశాయీ, మెరిశాయీ,
మాయింట్లో వెలిశాయీ.

గాంధి నెహ్రూ నేతాజీ
గంగాధరతిలక్ బొమ్మ
ఎన్నెన్నో బొమ్మలూ
తెచ్చారూ నాన్నారూ!

* * *

బొమ్మల పండగనాడూ
బొమ్మలన్ని తీర్చిపెట్టి
అమ్మ, అక్క నేను పోయి
అందర్నీ పిలుస్తాము!

* * *

పేరటాండ్రు అందరితో
పేరంటము చేస్తామూ!
పండ్లెన్నో తెచ్చియిచ్చి
పంపిస్తాం పాపలనూ.



నడిరేయి చిత్రకారుడు: పొన్నాడ లక్ష్మణరావు, (15) రాజోలు.

## విజయ దశమి

వులు. మీరందరూ రేపు ప్రొద్దున 8 గంటలకే స్కూలుకువచ్చి, రంగురంగుల గిలకలు తీసుకొని అందరిళ్లకువెళ్లి, దసరా పద్యాలు పాడి పప్పుబెల్లాలు తేవాలి'' అని మా కందరికి చెప్పేరు. వెంటనే బడిగంట గణగణ మ్రోగింది. బడి వదిలేసేరు. పిల్లలు మేష్టర్లు ఎవరి ఇళ్లకు వాళ్లు వెళ్లేరు.

నేను మా యింటికి వెళ్లేసరికి యిల్లంతా, దేవుడు మందిరంతో సహా, రంగురంగుల ఎలక్ట్రిక్ లైట్లతోను, సువాసనలుగల పూలగుత్తులతోను, యింపైన అగరువత్తుల పరిమళంతోను, సెంటువాసనలతోను, ఉండి చాలా అందంగా శృంగారంగా కన్నుల పండువుగా కనిపించింది. మా స్నేహితులు చాలమంది ఆడవాళ్లు, బొమ్మలకొలువు చూడ్డానికి మాయింటికి వచ్చేరు. అందరూ వచ్చేరు. పాటలు పాడుతున్నారు. చాలా సంతోషంగా సందడిగా వుంది. సరస్వతిపూజకూడా ఆనాడే ప్రారంభము.

మర్నాడు మా మేష్టారు చెప్పిన ప్రకారము సరిగ్గా 8 గంటలకే మే మందరము కొత్తబట్టలు కట్టుకొని బడికి వెళ్లేము. పిల్లలు అందరు వచ్చిన తరువాత బీరువాలో వున్న కొత్త గిలకలు తీసి ఒక్కొక్కర్నే వరుసగా పిలచి, మా కందరికి యిచ్చేరు. గిలకలు పట్టుకొని బాల బాలిక లందరమూ ఒక లైనుగా నుంచున్నాము. మేష్ట ర్లందరూ కొంతమంది ముందు కొంతమంది వెనుక నుంచున్నారు. అందరం కలసి మెల్లగా నడక సాగించేము.

"జయీభవ; విజయీభవ" అంటూ కేకలు వేసుకొంటూ అన్ని వీధులూ తిరిగి, అందరిళ్లకు వెళ్లి

"పావలా యిస్తేను పట్టబోమయ్యా,
అర్ధ యిస్తే మేము అంటబోమయ్యా
అయ్యవారికి చాలు ఐదు వరహాలు
పిల్లవాండ్రకు చాలు పప్పుబెల్లాలు."

అంటూ గిలకల పద్యాలు పాడేము. పది, ఐదు—ఎవరికి తోచింది వాళ్లు మేష్టర్లకిచ్చేరు. పిల్లలందరికీ పప్పుబెల్లాలు పెట్టేరు.

మా యింటికికూడా వచ్చేము. మా నాన్న జరీ పట్టు పంచల చాపు మా మేష్టారికిచ్చేరు. పిల్లలందరికీ పప్పుబెల్లాలు పెట్టేరు. చాలాసేపు దసరాపద్యాలు పాడించేరు. అప్పటికే 12 గంటల దరిదాపు కావస్తున్నది. ఎవరిళ్లకి వాళ్లని సూర్యభగవానుడు భోజనాలకు పంపించేడు.

ఆమర్నాడే మా స్కూలులో సరస్వతీపూజ ఆరంభము. మా స్కూలు కాంపౌండ్‌లో పెద్ద 'పెండాలో'కటి కట్టేరు. దాంట్లో ఒకప్రక్క స్టేజిమీద చక్కటి సరస్వతి విగ్రహాన్ని, ఒక లక్ష్మివిగ్రహాన్ని, వీణా మొదలగు వాయిద్య విశేషాలనీ, పుస్తకాలనీ పెట్టి యథావిధిగా సరస్వతి పూజకూడా చేసేరు. మధ్యాహ్నము మూడు గంటల లగాయతు, చక్కని పాటకచేరీ పెట్టేరు. అనేకమంది పురజనులందరూ చూడ్డానికి వచ్చేరు. నాటకాలు వినోదాలు, కోలాటాలు మొదలైనవన్నో మా బడి పిల్లలచేత ప్రదర్శింప చేశేరు. మా ప్రదర్శనాలు చాలా బాగున్నాయని గౌరవనీయులు కొంతమంది మాకు ప్రత్యేక బహుమానాలిచ్చేరు. ప్రార్థనా గీతాలతోను సరస్వతి స్తవంతోనూ, ఉత్సవాలారంభంచేసి జాతీయ గీతాలతోను, వందేమాతరంతోను ముగించేరు. పిల్లలందరికీ దేవీ ప్రసాదాలు మిఠాయిలు పంచిపెట్టేరు. రాత్రి సరిగ్గా 9 గంటలైంది. అంతటితో ఆ రోజు పండగ ఉత్సవాలు అయిపోయి నాయి. "జయీభవ! విజయీభవ!" అంటూ పిల్లలందరూ, గుంపులు గుంపులుగా మా వీధిలోంచే వెళ్లిపోయేరు. అందరూ ఎవరి ఇళ్లకు వాళ్లు వెళ్లేరు. మా వీధిలో పెట్టిన బొమ్మల కొలువులతోను, మా యింటిలో దేవీ పూజలతోను, మా స్కూలు ఉత్సవాలతోనూ, గౌరవంపొందిన "విజయదశమి" మళ్లీ ఏడాదికి ఎదురు చూస్తూ వెనక్కి వెళ్లింది.


"....గప్ చిప్ సాంబార్ బుడ్డీ!"
భూతపురి గోపి, (8) వాల్తేరు.


మైసూరు దసరాఉత్సవం ఫోటో కె. వి. కృష్ణవేణి—(మైసూరు.)

# కోయిల పాట

బొమ్మకంటి
ఆండాళ్ తాయారు
(వయస్సు 12) మద్రాసు.



"కో" యంటు పాడింది కోయిలా,
తీయగా పాడింది కోయిలా,

తోటలో కోయిలా పాటవిని మా పాప
తొరతొరగ పరుగెత్తి తోటలో కెళ్ళింది,

తీయనీ కోయిలా పాటువిని మా పాప
"కో" యంటు తనుకూడ పాట మొదలెట్టింది.

కోయిలా, పాపాయి పోటీయే వేశారు,
"కో" యంటె "కో" యంటు పోటీగ పాడారు.

ఎంతసేపైనాను పంతమొదలక పాప
సంతోషముగ పాట పాడుతూనేవున్నది.

కోయిలకు ప్రాణమూ విసిగిపోయింది.
కుహూ కుహూ మని కూసి అలసిపోయింది.

చిన్న మా పాపాయి చిలిపితనమూ చూచి.
చిన్నబుచ్చుకు కోయి లెగిరిపోయింది.

పంతముగ కోయిలతొ పాటపాడిన పాప
సంతోషమున వచ్చి గంతులేసింది.

మా పాప పోటీగ పాడి గెలిచింది.
పాపమూ కోయిలే ఓడిపోయింది.

# ఋణానుబంధం

ఆ రోజు మా తమ్ముడి పుట్టినరోజు పండుగ. ఆవాళతో వాడికి ఏడాది వెళ్ళిపోతుంది. మేమంతా చాలా సంతోషంగా వున్నాము. మా ఇంట్లో పెరిగిన పిల్లిపిల్ల ఒకటి మా తమ్ముడిరూపంలో అవతరించిందని మా అందరి నమ్మకం. అందువల్లనే, మేము వాణ్ణి "మ్యావ్", అని పిలచేవాళ్ళం. అన్నిటికంటే ఆశ్చర్యం ఏమిటంటే మా పిలుపుకు వాడు పలికేవాడు


త్రిపురనేని ప్రమీల (14)

మద్రాసు


పిలుపు పిలుపుకీ ముసిముసి నవ్వులు ఒలకపోసేవాడు... పిల్లి పిల్ల మా తమ్ముడిగా అవతరించిన కథ చెపుతాను......

మా మేనత్తగారికి మా వూరే బదిలీ అయింది. ఆమె భర్తకు డిప్యూటీకలెక్టరు ఉద్యోగము. వాళ్ళు వేరుగా యిల్లు అద్దెకు తీసుకొని వుంటున్నారు. ఒకరోజు నేనూ, మా అమ్మా నాన్నా, చెల్లెలూ, పెద్ద తమ్ముడూ, అందరం వాళ్ళని చూట్టానికి వెళ్లాము. వాళ్ల ఇంట్లో రెండు పిల్లికూనలు వున్నాయి



# వరద పాట

దేవరకొండ సత్యం, దేవరకొండ సుబ్రహ్మణ్యం
(తణుకు)

గోదావరి వరదవచ్చి,
గూడు గూడు కూలిపోయి,
ఏడుస్తూ జీవితాల్ని
యీడుస్తూ బ్రతుకుతూన్న
లక్షలాది నావాళ్లని
చూస్తుంటే ఏడుపొచ్చి
గుండెల్లో గుబులువచ్చి,
కళ్లమ్మట కన్నీళ్లై
వొస్తోందే అమ్మా!

పాపం! అమ్మా! పాపలతో,
కట్టుకున్న బట్టలతో,
మిట్టఎక్కి మిద్దెఎక్కి,
పిట్టల్లా గుట్టల్లా
పడిఉన్నారెల్లాగే?
మరి గోదావరి తల్లి కింత
మనమంటే కోపం ఎందుకు?

ఇన్నాళ్లూ సాకి సాకి
యీరోజున కసించింది.
తెలుగువాళ్లదే పాపం?
తెలుగు సీమదే లోపం?
చెప్పే అమ్మా!
అందరమూ కలసి మెలసి
ఆర్తులకు సహాయం చేద్దాం.

ఇంటింటా బియ్యమడిగి
యిచ్చేద్దాం వాళ్లకి.
చొక్కా టోపీ తొడుగే,
చందా పోగుచేయ వెళ్తానే!

మొన్న మొన్న ఉదయించిన
మన రాష్ట్రపు బాగుకొరకు
మాలో మేం బుద్ధికలిగి ఉంటా
మని
మా దేశం పూర్వంలా
తలఎత్తగ
తెలుగునాడు వెలుగునాడు
అనిపించగ
సంఘీభావం ప్రకటిస్తామని
గోదావరితల్లికి వినతులు చేద్దాం,
ప్రణతులు చేద్దాం.

అప్పుడు మళ్లీ గోదావరి
దయతో, పంటల లయతో,
భద్రాచలం రాజమండ్రీ
పరిసర ప్రదేశాలన్నిటినీ
ఫలవంతం సుఖవంతం చేస్తూ
ప్రవహిస్తుందే అమ్మా! మన
లను
దీవిస్తుందే అమ్మా!

## ★ ఋణానుబంధం ★

వాటిని పెట్టి, వాటి తల్లి చచ్చిపోతే, వాళ్లు కొద్దిగా పాలుపోసి పెంచుతున్నారు. అందులో ఒకటి తెల్లగా పత్తాబత్తిలాగావుంది. ఆ పిల్ల మీద మా కందరికీ యిష్టం కలిగింది. మా మేనత్తను అడిగి, ఆ పిల్లిపిల్లను తీసుకొనివొచ్చి మేము దాన్ని పెంచాం.

ఆ పిల్లిపిల్ల మా యింట్లో ఒక సంవత్సరం పెరిగింది. 'మ్యావ్' 'మ్యావ్' అంటూ మా కాళ్ల చుట్టూ తిరిగేది. దాని తెలివి తేటలకు మేము ఆశ్చర్య పడేవాళ్లం. ప్రొద్దున్నే పాలవాడు వచ్చే టయిముకు, ఎదురుచూస్తూ కూర్చునేది. పాలవాడు రాగానే తన ప్లేటుకోసం అంట్లు తోమే పని మనిషిదగ్గరకు వెళ్లి, తన ప్లేటు కడిగియిచ్చేదాకా, గల్లంతు చేసేది. పాలు ఆ ప్లేట్లోపోస్తే తప్ప తాగేది కాదు. ఎంత ఆకలివేసినా సరే, అమ్మ రావాలి, ఆ ప్లేట్లో పాలు పొయ్యాలి - చచ్చినా యితరవస్తువులు ముట్టేది కాదు. దొంగతన మంటే ఏమిటో ఎరగదు. దాని అమాయకత్వాన్ని చూచి మా నాన్నగారు, "మనం విడిచిపెడితే, ఇది ఏలా బ్రతుకుతుందో!" అనేవారు.

ఆ పిల్లిపిల్లంటే మా నాన్నగారికి కూడా చాలా ఇష్టం. ఇష్టం లేకుండా ఏమవుతుంది? ఆయన రాత్రి ఏ వేళకు వచ్చినా, వచ్చే దాకా మేలుకునివుండేది. ఆయన రాగానే 'మ్యావ్' 'మ్యావ్' అంటూ ఆయన కాళ్లచుట్టూ నాలుగయిదుసార్లు తిరిగి, ఆయన్ని భోజనానికి కూర్చోబెట్టి తానుకూడా వొక ముద్ద తిని, అప్పుడు నిద్రపోటానికి వెళ్ళేది. దాని ఆప్యాయతకు మా నాన్నగారికే చాలా ఆశ్చర్యము వేసేది. అది యింట్లో మాతో పాటు తనూ వొక మెంబరుగా

వుండేది. దానిని మేము 'చిట్టీ' అని పిలచేవాళ్లం.

## 2

ఆనాడు ముక్కోటి ఏకాదశి. అందరం ప్రొద్దున్నే లేచాము. మా చిట్టి కనుపించలేదు. దాని కోసం యిల్లంతా వెతికాము. కాని ఇంట్లో ఎక్కడా లేదు. ఎక్కడికన్నా వెళ్ళిందేమో అనుకున్నాము. కాని అది ఎవరి ఇళ్లకూ వెళ్లదని మాకు తెలుసు. పాలవాడు వచ్చాడు. పాలుపోసి వెళ్లాడు. పని మనిషి, దాని పాలప్లేటు తోమి వంటింట్లో పెట్టి వెళ్ళింది. కాని మా చిట్టి రాలేదు. మేము భయపడుతూ అటూ యిటూ తిరుగుతూవుంటే, "మీ నాన్నగారు వచ్చే వేళ అయింది. ఆవేళకు అదే వస్తుందిలే," అన్నది, మా అమ్మ.

మా నాన్నగారు వచ్చారు. కాని అది రాలేదు. నాన్నగారు భోంచేసి మళ్ళీ ఆఫీసుకు వెళ్ళిపోయారు. అది యింకా రాలేదు. కాలం గడుస్తున్నకొద్దీ, మా అమ్మ కూడా కంగారుపడటం మొదలు పెట్టింది - "ఎక్కడకు పోయిందో పిచ్చి మొద్దు!" అన్నది.

మేము యిరుగుపొరుగు వాళ్లని, ఇద్దరి ముగ్గురిని అడిగాము. వారు, మాకు కనపడలేదంటే మాకు కనబడలేదు, అన్నారు. కాలం గడుస్తున్నకొద్దీ దానికి, ఏ అపాయం జరిగివుంటుందో అని నాకు అనుమానం ఎక్కువయింది. బిక్కమొఖం వేసుకుని తిరుగుతున్న మా చెల్లెలిని చూస్తే, నిజంగా గుండె తరుక్కుపోయింది. అస్తమానం దాన్ని ఎత్తుకు తిరుగుతుండేది మా చెల్లెలు. దాన్ని చంకలో పెట్టుకుని రబ్బరుబొమ్మను తిప్పినట్లు తిప్పినా ఏమీ అనేది కాదు మా 'చిట్టి'. మా చెల్లెలు ఇవన్నీ తలుచుకొని ఏడ్చి, ఏడ్చి పడుకొని, నిద్రపోయింది.

సాయంకాలము పెరట్లో కూర్చుని నేనూ, అమ్మా వెనకింటి ఆమెతో మాట్లాడుతున్నాము. 'మాటా, మాటా మీద పిల్లిపిల్ల సంగతి వచ్చింది. వెనకింటి ఆవిడ, 'చెట్టిగారి కుక్క దేన్నో చంపిందని చెప్పుకుంటున్నారమ్మా,' అన్నది.

ఈ మాట వినేసరికి నా గుండె గుభేలుమన్నది. ఆవిడను ప్రశ్నల మీద ప్రశ్నలు వేశాను. అది పిల్లి పిల్లా? తెల్లగా బొద్దుగా వుంటుందా? కళ్లు ఎర్రగా మనిషి కళ్లకు మల్లే వుంటాయా? నా ప్రశ్నలన్నిటికీ విడ జవాబు వొకటే 'నాకు తెలియదు' అని.

చెట్టిగారి అమ్మాయి నాకు స్నేహితురాలే. మేమిద్దరం కాన్వెంటులో చదువుకున్నాము. ఆగలేక సంగతి తెలుసుకుందామని చెట్టిగారి యింటికి వెళ్లాను. ఆమె యింట్లోనే వున్నది. తనకీసంగతి ఏమీ తెలీదని చెప్పి, వాళ్ల పనివాణ్ణి పిలిచి, అడిగింది. రాత్రి తమ కుక్క ఒక పిల్లిపిల్లను చంపినవిషయము నిజమే నసీ, ఆ పిల్లిపిల్ల యెవరిదో తెలియదనీ చెప్పాడు వాడు.

'ఎందుకు చంపింది?' అని అడిగాను.

'ఇంట్లోకి వస్తుంటే కుక్క ఎగబడి పట్టుకుంది. మేము వచ్చేటప్పటికే నోట కరుచుకొని విదిలించి చంపివేసింది. పార్కుదగ్గర పడవేశాం' అన్నాడు.

ఆ పార్కు మాయింటిముందే వున్నది. నేను అక్కడకు పరిగెత్తాను.

## 3

నేను పార్కుదగ్గరకు వెళ్లటం చూచి మా యింటిముందు ఎవరికోసమో ఎదురు చూస్తున్నట్లు నుంచున్న మా తమ్ముడూ, చెల్లెలూ పరుగెత్తుకొని వచ్చారు. అందరం పార్కుచుట్టూ వెదికాము.

దూరంగా వెదుకుతున్న మా తమ్ముడు, "అక్కా?" అని పిలిచాడు. మేము వాడిదగ్గరకు పరుగెత్తుకొని వెళ్లాము. అక్కడ ఒక గుంట వున్నది. ఆ గుంటలో వున్నది పిల్లిపిల్ల. దాన్ని చూచేసరికి నా కళ్లలో నీళ్లు తిరిగాయి. 'పాపం' అన్నాడు, మా తమ్ముడు. మా చెల్లెలు ఎక్కి ఎక్కి ఏడవటం మొదలుపెట్టింది. పిల్లిపిల్లను కాదు మేము చూచింది - పిల్లిపిల్ల కళేబరాన్ని. దాని వొళ్లంతా నెత్తురే - చచ్చి పడివుంది.

నా కళ్ళను నేను నమ్మలేకపోయాను. గుమ్మటంలాగ ఇల్లంతా కలయతిరిగే మా 'చిట్టి' కదలకుండా రక్తంముద్దలాగు పడివున్న ఈ పిల్లిపిల్లేనని అనుకోలేకపోయాను.

ఇంతలో మా చెల్లెలు, "చిట్టిని యింటికి తీసుకొనిపోదాం" అన్నది ఏడుస్తూ.

మేమంత ప్రాణపదంగా పెంచుకున్న పిల్లిపిల్లనూ, మాతోపాటు తిరిగిన పిల్లిపిల్లను, నేను విడిచిపెట్టి వెళ్లలేకపోయాను. ఇంతలో మా తమ్ముడు వొక బుట్ట తెచ్చాడు.



గురుశిష్యులు

ఫొటో: సి. పూర్ణయ్య, విశాఖపట్నం.

## ఋణానుబంధం

మేము ఆ కళేబరాన్ని బుట్టలో పెట్టుకొని ఇంటికి తీసుకొని వెళ్లాము. మమ్మల్ని చూచి మా అమ్మకూడా కన్నీరు పెట్టుకుంది. 'పిచ్చి మొద్దు కుక్క, కరుస్తుందనికూడా తెలియక పోయె' అన్నది; కళ్లు తుడుచుకుంది.

'ఏలాగూ తెచ్చారు. దానికి దహనసంస్కారాలు చెయ్యండి,' అన్నది అమ్మ.

మా దొడ్లో ఒక జామచెట్టు వున్నది. ఆ జామచెట్టు అంటే మాకందరికీ యిష్టం. మా తమ్ముడూ, మా చెల్లెలూ ఎప్పుడూ దానిమీదే వుంటారు. ఆ చెట్టుక్రింద పాతి పెట్టటం మంచిదని తోచింది నాకు. చుట్టుపక్కల వున్న స్నేహితులను పిలచి ఆ చెట్టుక్రింద మా చిట్టిని సమాధిచేశాము...

ఇంతలో మా నాన్నగారు వచ్చారు. ఆఫీసునుంచి వస్తూవస్తూ మా మేనత్తగారి యింటికి వెళ్లి ఆమెను తీసుకొనివచ్చారు. నాన్నగారిని చూడగానే మేము ఏడుపు ఆపుకోలేకపోయాము. మా చెల్లెలు మరీ. ఒక్కసారిగా ఏడవటం మొదలుపెట్టింది. నేనూ, అమ్మా జరిగినసంగతంతా చెప్పాము. మా నాన్నగారు బిగబట్టుకొని నుంచున్నారు. కాని ఆయన కళ్లు చెమ్మగిల్లటం నేను చూచాను. నాకు దుఃఖం పొర్లిపొర్లి వొచ్చింది.

నా దుఃఖం చూచి "పిల్లిపిల్ల చచ్చిపోతే ఎక్కడన్నా ఏడుస్తారా?" అన్నది మా అత్త.

"నీకు తెలియదత్తా, అదంటే మాకు ప్రాణం; మేమంటే దానికి ప్రాణం; మేమంతా కలిసిపెరిగాం" అన్నాను.

"అంత ప్రాణం అయితే సంబంధాలు వూరికే పోతవటే. అదిఏదో ఒకరూపంలో మళ్ళీ మీ యింట్లో పుడుతుంది," అన్నది అత్త మా అమ్మవంక చూస్తూ. "ఋణానుబంధం కాకపోతే మనిషి పోయినట్లు మీరింత విచారపడతారా?" అన్నది. మా అత్తయ్యమాట నిజం అయింది. పదినెలలు దాటకముందే మాకు తమ్ముడు పుట్టాడు. ఆ పిల్లిపిల్ల మమ్మల్ని విడిచిపెట్టలేక ఈ రూపంలో పుట్టిందని మా ఉద్దేశము. అందుకనే మా తమ్ముడంటే మాకందరికీ ప్రేమే కాకుండా గౌరవం కూడా...

4

వాడి పుట్టినరోజు పండక్కి నేను వాడికి పాలుతాగేందుకు వొకప్లేటు కొని యిచ్చాను. పిల్లిపిల్లలాగా వాడు, ఆ ప్లేటులోనే తాగుతాడో, లేకపోతే ఎక్కడపడితే అక్కడ తాగుతాడో, చూడాలి... ★

# నా కవితాభ్యాసం

## రవీంద్రనాథ టాగూరు

అప్పటికి నాకు ఎనిమిదేళ్ళకంటె ఎక్కువుండవు. మా తండ్రిగారి మేనగోడలి కుమారుడు జ్యోతి నాకంటె బాగా పెద్దవాడు; ఇంగ్లీషు సాహిత్యంలోకి కొత్తగా అడుగుపెట్టాడు. 'హామ్లెట్' నాటకంలోని హామ్లెట్ తాలూకు స్వగతాన్ని మహోత్సాహంతో బిగ్గరిగా చదివేవాడు. నా అంత కుర్రాడిచేత కవిత్వం వ్రాయించాలని అతడికెందుకు ఆలోచన తట్టిందో నాకర్థం కాలేదు. ఒకరోజు మధ్యాహ్నం నన్ను తన గదికి పిలిపించాడు. పిన్నా పద్యం రాయమని నన్ను ప్రోత్సహించాడు. పద్యాలు గుమాత్రలతో వ్రాయబడే ఒక రకం ఛందస్సును వివరంగా బోధించాడు.

అంతవరకూ నేను చూసినవల్లా అచ్చుపుస్తకాల్లో ముద్దుగా ముద్రించబడిన పద్యాలు మాత్రమే. ఆపద్యాల్లో ఎక్కడా కొట్టివేతలు, తుడుపులు గాని, మాటలు దొరక్క, భావం దొరక్క తన్నుకోవడం గాని మచ్చుకైనా ఉండేవి కావు. అంత కష్టపడిగా, నిర్భరంగా కవిత్వం వ్రాయడం ఎంత తన్నుకున్నా నాకు చేతనవుతుందా అని అనుకునేవాణ్ణి.

ఒకరోజు మా యింట్లో ఒకదొంగ పట్టుబడ్డాడు. దొంగ ఎలావుంటాడో చూడాలనే ఆతురతతోను, చెప్పలేనంత భయంతోను వణికిపోతూ దగ్గరికి వెళ్లాను. తీరా చూస్తే వాడు మామూలు మనిషిలాగానే వున్నాడు! మా యింటి కాపలావాడు ఆ దొంగని పాపం పట్టుకుని, కొంచెం గట్టిగానే చేయి చేసుకున్నాడు. నాకు చాలా జాలివేసింది. నా కవిత్వం విషయంలో కూడా నా కప్పుడు ఇటువంటి జాలే కలిగింది.

ఇష్టం వచ్చిన కొన్ని మాటలు విరిచి ఒకదానిపక్కన ఒకటి పద్యాలు మాత్రలకు సరిపడేటట్లు అమర్చాను. మళ్లీ చదివిచూసుకుంటే, అది కవిత్వమనే భ్రాంతికూడా కలగలేదు. అందుచేతే ఇప్పటికీ ఎవరైనా కవిత్వంమీద చేయి చేసుకుంటుంటే, ఆరోజున దొంగని కొడుతున్నప్పుడు పడినంత బాధా పడుతూంటాను. ఏం బాధపడితే ఏం లాభం? వాళ్ల చేతులనుంచి కవిత్వాన్ని తప్పించలేనుగదా! బహుశా దొంగలు కూడా అంతమంది చేతుల్లో, అంత బాధ పడివుండరు.

పద్యం వ్రాయడానికి మొదటిసారి ప్రయత్నించనే ప్రయత్నించాను గనుక కొంత బెరుకు వదిలింది. ఇక నా కవిత్వాసక్తికి కళ్లెం వేసి ఆపడానికి వీలుకాలేదు. మా గుమాస్తాల్లో ఒకాయనడిగి ఒక వ్రాత పుస్తకం సంపాదించాను. అది నీలపు కాగితాల పుస్తకం. పెన్సిలు తీసుకుని దాన్నిండా వంకరటింకరగా గీతలు గీశాను. బాల్యసహజమైన పెద్దపెద్ద వంకర అక్షరాలతో పద్యాలు వ్రాయడం ప్రారంభించాను.

కొత్తగా కొమ్ములు మొలిచే లేడిపిల్ల ఎక్కడపడితే అక్కడ కొమ్ములతో కుళ్లగించినట్టు, నేనుకూడా నావచ్చీరాని కవిత్వంతో గందరగోళం లేవదీశాను. నా కవిత్వం చూసి మా అన్నయ్య* మహా మెచ్చు

* మహర్షి దేవేంద్రనాథ టాగూరుకు ఏడుగురు కొమారులు. రవీంద్రుడు ఆఖరివాడు. ఇక్కడ అన్నయ్య అంటే ఆరవ అన్నయ్య.



"తొలి వార్త"

ఫోటో: ఎ. మాధవరావు, విజయవాడ.



పెళ్ళినాటికి దాచుకోవే, ముత్తియమ్ములు రాలునేమో!

# నా కవితాభ్యాసం

కున్నాడు. వినేవాళ్లెవరు దొరుకుతారా అని ఇల్లంతా వెదికాడు.

నాకిప్పటికీ బాగా జ్ఞాపకం. ఆరోజున మేమిద్దరం మా జమీందారీ ఆఫీసు గదుల్లో అక్కడి ఉద్యోగులందర్నీ నా కవిత్వంతో ఓడించి, తిరిగి వస్తున్నాము. దోవలో "ది నేషనల్ పేపర్" సంపాదకుడు నవగోపాల్ మిత్ర తారసిల్లాడు. ఆయన అప్పుడే మా యింట్లోకి వస్తున్నాడు. ఆయన్ని మా అన్నయ్య నిలవేశాడు. "నవగోపాల్ బాబూ! చూశారా! మా రవి పద్యాలు వ్రాశాడు. వింటారా?" సమాధానం కోసం ఆగకుండా చదవసాగాను.

నా రచనలు అప్పటికున్నవే బహుకొద్ది. అన్నీ కలిపి జేబుల్లో తేలిగ్గా మోసుకుపోవచ్చు. నేనే గ్రంథకర్తని, ముద్రణకర్తని, ప్రచురణకర్తని. మా అన్నయ్య మాత్రం నాకు ప్రకటనకర్త (ఎడ్వర్టైజర్) గా పనిచేశాడు. నా పద్యాలు పద్మం మీద వ్రాసినవి. మెట్లదగ్గరే నిలబడి నవగోపాల్ బాబుకు పద్యాలు వినిపించాను. నా ఉత్సాహం తారస్థాయి అందుకున్నది గనుక కంఠంకూడా తారస్థాయికి హెచ్చించి చదివాను. "బావుంది, బావుంది" అన్నాడాయన. "కాని, ద్విరేఫం అంటే ఏమిటోయ్?" అని అడిగాడు.

ఈ పదం నాకెక్కడ దొరికిందో నాకు జ్ఞాపకం లేదు. ఇంకొక మామూలు మాట ఏదైనా ఆ ఛందస్సులోకి సరిపోయేదే. కాని, కావాలనే 'ద్విరేఫం' అనే పెద్దమాట ఉపయోగించాను. దాని మీదే నా ఆశలన్నీ పెట్టుకున్నాను. అంతకు ముందు నా పద్యాలు విన్న మా ఉద్యోగులు ఆమాటవిని గుండెలు బాదుకున్నారు కూడాను. కాని ఎందుచేతో మరి నవగోపాల్ బాబు ఆ మాటతో దంగైపోలేదు సరికదా, చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు! 'అబ్బే, ఈయనకేమీ తెలియ'దని "సహృదయుడుకా"డని నిర్ధారణ చేసుకున్నాను. మళ్ళీ ఆయనకి నా కవిత్వమెప్పుడూ వినిపించలేదు. ఆ తరవాత నేను వయస్సులో పెద్దవాణ్ణవుతూ వచ్చానుగాని, నాకవిత్వం వినేవాడు సహృదయుడైందీ, కానిదీ తెలుసుకునే పద్ధతి మాత్రం బోధపడలేదు. నవగోపాల్ బాబు హేళనగా నవ్వినా, నా 'ద్విరేఫం' మాత్రం తేనె తాగి మత్తెక్కిన తుమ్మెదలాగ దాని స్థానంలో అది అంటిపెట్టుకుని ఉండిపోయింది.

* * *

ఆ నీలపుకాగితాల పుస్తకం అనతి కాలంలో నిండిపోయింది. దాన్నిండా గీతలు, అక్షరాలతో గజిబిజిగా గిజిగాడు గూడులాగ తయారైంది. రచయిత దాని మీద చూపే ఆప్యాయత మూలానగాబోలు, ఆపుస్తకం కాస్తా నలిగిపోయింది. పేజీల మూలలు లోపల ఉన్న పద్యాలు బయటికి పారిపోకుండా ఆపుతున్నట్లు వంకరతిరిగి పైకి లేచాయి. చివరికాపుస్తకం ఏ వైతరణీ ప్రవాహంలోపడి కొట్టుకుపోయిందో మళ్లీ నాకంటపడలేదు. నాపద్యాలు అచ్చు యంత్రపు రోలర్లమధ్య నలిగి నరకబాధ పడవలసిన అవస్థ తప్పిపోయినందుకుమాత్రం నేనిప్పటికీ సంతోషిస్తూంటాను. వాటికి జననమరణ రహితమైన కైవల్యపదం సిద్ధించి వుంటుంది.

కవిగా నా పేరు దశదిశలా వ్యాపిస్తుంటే, నాకు సంబంధించనట్టుగా చూస్తూ వూరుకున్నాననిమాత్రం చెప్పను. సత్కారీబాబు మా క్లాసుమేష్టారు కాకపోయినా, నేనంటే ఆయనికి చాలా యిష్టం. ఒకరోజున ఆయన నన్ను పిలిపించి "ఊఁ. నువ్వు కవిత్వం వ్రాస్తున్నావన్న మాట," అని అడిగాడు. నేనుకూడా నిజం దాచలేదు. ఆరోజునుంచీ ఆయన నన్ను అడపాతడపా పిలిచి, రెండు పద్యపాదాలు

యిచ్చి, నన్ను మరో రెండుపాదాలతో పూర్తిచేయమనేవాడు.

మాస్కూలు సూపరింటెండెంటు పేరు గోవిందబాబు. నల్లగా, పొట్టిగా, గుమ్మటంలాగ వుండేవాడు. మా మేడ రెండో అంతస్తులోని ఆఫీసు గదిలో, ఎకౌంట్ పుస్తకాలు ముందు వేసుకుని కూర్చునేవాడు. ఎప్పుడూ నల్లటి సూటు ధరించేవాడు. ఆయనంటే మాకు చచ్చే హడలు. ఆయన్ని చూస్తే యమధర్మరాజు ఇలాగే వుంటాడనిపించేది. ఒకసారి నన్ను నాకంటె పెద్ద పిల్లలు అయిదారుగురు వెంటబడి తరమసాగారు. నేను భయపడి ఆయన గదిలో దూరాను. నా పక్షాన సాక్ష్యమిచ్చేందుకు నా కన్నీళ్లు తప్ప మరెవరూ లేరు. అప్పటినుంచీ ఆయనకి నేనంటే వాత్సల్యం కలిగింది.

ఒకరోజున ఆయన నన్ను తన గదిలోకి పిలిపించాడు. భయంతో బిక్కచచ్చి వెళ్లాను. కాని, నూసీ చూడగానే "ఊఁ. నువ్వు కవిత్వం వ్రాస్తున్నావన్నమాట," అని అడిగాడు. అవునని చెప్పేశాను. ఏదో పెద్ద నీతి సూత్రం చెప్పి దానిమీద పద్యం వ్రాయమన్నాడు. ఆ నీతి ఏదో జ్ఞాపకం లేదుగాని, ఆ క్షణంలో నన్ను అలా అడగడమే ఆయన వాత్సల్యానికి సూచనఅంటే ఎవరూ నమ్మరు—ఆయన బెత్తం కింద చదువుకున్న విద్యార్థులు తప్ప.

మర్నాడు పద్యాలు వ్రాసి పూర్తిచేసి ఆయనకిచ్చాను. వెంటనే నన్ను పెద్ద క్లాసుకి తీసుకుపోయి, అక్కడి విద్యార్థుల ముందు నుంచోపెట్టి "చదువు" అని ఆజ్ఞాపించాడు. నేను గొంతెత్తి చదివాను.



"ఎవ్వరేమన్నారు, ఎడ్చేటిపాపా!"

ఫొటో: పి. శివరామరాజు, మద్రాసు.

ఈ నీతి పద్యాల్లో ఉన్న ఒక్క విశేషమూ ఏమిటంటే, వాటి ఐపూ ఆనమాలూ ఇంతవరకూ దొరకలేదు. ఆ క్లాసు పిల్లలమీద ఆ పద్యాల నైతిక ప్రభావం కూడా నా కంతగా ప్రోత్సాహ మివ్వలేకపోయింది. నేను చదువుతున్నంతసేపూ నామీద ఎవరికీ భయభక్తులు కలిగినట్టు లేదు. చాలమంది అవి నేను వ్రాసినవి కావని నిశ్చయించుకున్నారు. ఒక కుర్రాడు, నా పద్యాలు ఏపుస్తకంలోంచి తస్కరించబడ్డవో ఆ పుస్తకం ఒక్కచిటికెలో తీసుకురాగలనన్నాడు. కాని తీసుకురమ్మని ఎవరూ వాణ్ణి అడగలేదు. చివరికి, నన్ను చూసి నామాదిరిగా కవితా కన్యను పాణిగ్రహణం చేసుకు తీరాలని పట్టుబట్టిన వాళ్ళ సంఖ్య రోజురోజుకీ వృద్ధికాజొచ్చింది. అయితే అందుకు వాళ్ళనుసరించిన పద్ధతులు మాత్రం నైతికాభివృద్ధికి ఉపకరించేవిగా లేకపోవడం చింతించదగినది.

ఈ రోజుల్లో ఒక బాలుడు పద్యాలు వ్రాస్తున్నాడంటే అందులో వీసమెత్తు వింత కూడా లేదు. కవిత్వాన్ని గూర్చిన మోజు (గ్లామర్) ఎప్పుడో పోయింది. నా చిన్నతనపురోజుల్లో కవిత్వం వ్రాసే కొద్దిమంది స్త్రీలనూ భగవత్ సృష్టిలోకల్లా అపురూపమైన ప్రాణులుగా భావించేవారు. ఈరోజుల్లో ఫలానా అమ్మాయి కవిత్వం వ్రాయడం లేదంటే "అసంభవం, నమ్మను గాక నమ్మను," అనేవాళ్లున్నారు. మొదటి క్లాసుతో ప్రారంభించి చివరిక్లాసుకు వెళ్ళేలోపుగానే నేటికవిత్వం మొలకెత్తుతున్నది. అందుచేత నాచిన్నతనంలోలాగా బాలురకవిత్వాన్ని గురించి ప్రోత్సహించే గోవిందబాబులు ఈ రోజుల్లో కనబడరు.

మా అన్నయ్య గుణేంద్రనాథునికి* నాపద్యాలు వీలైనప్పుడల్లా వినిపించేవాణ్ని. ఆయన ఆట్టే తీవ్రవిమర్శకుడు కాడు. నాపద్యాలు విని ఆయన పలిబుచ్చిన అభిప్రాయాలునిజానికిఎడ్వర్ట్ టైజ్ మెంట్లుగా బాగా పనికొస్తాయి. అయినా, నా కవిత్వంలో మరీ పసితనం కనిపించినప్పుడల్లా "హాఁ! హాఁ!" అని నవ్వేవాడు.

ఒకరోజున "భారతమాత"మీద పద్యాలు వ్రాశాను. ఒక పాదంచివర ప్రాసకోసం చాలసేపు తన్నుకున్నాను. చివరికి 'బండి' అని అర్థం వచ్చేమాట దొరికింది. వెంటనే ఆ 'బండి'ని అవసరమున్నా లేకపోయినా, వచ్చేందుకు సరియైనరోడ్డున్నా లేకపోయినా లాక్కొచ్చి పద్యపాదం చివర నుంచోబెట్టాను. ఈపద్యం విన్నప్పుడు గుణేంద్రనవ్విన నవ్వుతుపానులో ఆబండి ఎక్కడికెగిరిపోయిందో ఎగిరిపోయింది; మళ్లీ దాన్ని గురించిన వార్తలు నాకు చేరలేదు. ★

* స్వయానా నా అన్నయ్య కాదు. తండ్రి సోదరుని కుమారుడు. గుణేంద్రనాథ్ కుమారులే ప్రసిద్ధచిత్రకారులు గగనేంద్రనాథ్ టాగూర్, అవనీంద్రనాథ్ టాగూరు.

ఆనాడు శ్రావణ మంగళవారం.

"పెళ్ళైన పడుచులంతా ముత్తైదుతనాన్ని పెంపొందించుకునే రోజు" అంటూండేవాడు మామయ్య. సరూ అక్కయ్య కూడా నోచుకుంటోంది మంగళ గౌరీవ్రతం. తెల్లారే లేచి తలంటి పోసుకుంది. ఆరేసిన పట్టుచీర కచ్చాపోసి కట్టుకుని పీటకి పసుపు రాస్తూ కూచుంది. గుమ్మాల్నిండా పచ్చగా పసుపు. పసుపు మీద పెద్దపులి మచ్చల్లా మెత్తిన కుంకుమ, బియ్యప్పిండి చుక్కలు, గుమ్మాలకి మామిడిమండలు, అచ్చం పెళ్ళివారిల్లులా వుంది మాడాబా!

"ఏరోయ్, పండుగఅనా ఇవాళ ఎనిమిదైనా లేవలేదు?" నాన్నగారు కేకేశారు దొడ్లో స్నానం చేస్తూ.

శశి (13)
సికింద్రాబాదు.

విసుక్కుంటూ లేచి పక్క చుట్టాను. చేతులో కళ్ళపొడేసుకుని, వంటింటి గుమ్మంలోకెళ్ళా, అమ్మేం చేస్తోందో చూద్దామని. అడ్డెడు తప్పెలతో లడ్డయేస్తోంది! అది చూస్తేగాని గుర్తురాలేదు, ఇవాళ అత్తయ్యవాళ్ళ భోజనం మాఇంట్లోనేనని.

"ఏరోయి నీకిప్పుడే తెల్లారినట్లుందే?" అంది అత్తయ్య దోసకాయలు చెక్కుతీస్తూ.

నవ్వుతూ దొడ్లోకెళ్ళాను. గబగబా మిగతాపనంతా కానిచ్చి స్నానం చేశాను. తల దువ్వుకుంటూ టైం టేబుల్ చూశా. "ఊ... వెధవ చదువు" ఇవాళ్టికి ఇంట్లోనే ఉండాలనిపించింది. అన్నట్టు అమ్మ నిన్ననే చెప్పిందిగా!

వెళ్ళి వంటింటి గుమ్మంలో కూర్చున్నా. నాన్నా, సరూ అక్కయ్యా, పొగలో అమ్మ వారితో సతమతమాతున్నారు. నాన్నగారు గౌరీసహస్రనామాలు తియ్యగా చదువుతూంటే అక్కయ్య మా దొడ్లో పూసిన



పల్లకీ: అల్లుమోలు సావిత్రి (6), గునుపూడి.

మల్లెపూలు అమ్మవారి మీద వేస్తోంది. పూజయింతరవాత వాయనం ఇవ్వటం గారెలు, బజ్జీలు పెట్టిన పళ్లెం అత్తయ్యొకచివరా, అక్కయ్యొకచివరా పట్టుకున్నారు.

"ఇస్తి వాయనం" అంది అక్క నన్ను చూచి నవ్వుతూ. అత్తయ్య, అక్కవైపు గుడ్లురిమిచూచి "పుచ్చుకుంటి వాయనం" అంది.

"నా వాయనం పుచ్చుకున్న వని తెవరు?"

"గౌరీ పార్వతి"

"కోరితి వరం"

"ఇస్తి వరం"

తంతు పూర్తయింది మహా నైవేద్యమయింది. మా నివేదన కావాలిక! నాన్నా, మావయ్యా మడి కట్టుకుని పక్కగా కూర్చున్నారు. నాకు పక్కగా పీట వేశారు.

"పండగనాడు ఈ దిరీసే (డ్రెస్సు) మిత్రా?" అంది అత్తయ్య నా పైజామా వైపు చూస్తూ.

వీళ్ల పోరుపడలేక బనీను తొడగటం మానేశా అన్నం తినేటప్పుడు. మొలమీద పంచ నిలవదాయె! ఏంచేసేది?



పెళ్లికూతురు :

శిష్ట్లవఝ్ఝుల ఉమాశంకర్ (14) గుంటూరు.

అమ్మయ్య! గారె, బజ్జీ, పరవాన్నం, వీటన్నిటితో కుస్తీపట్టేసరికి, కూర్చున్నవాణ్ని లేవటానికి భగీరథ ప్రయత్నమైంది. (ఎన్నడూ రాయనివాడిని, ఒకరోజు కాపీ రాసేసరికి మా మేస్టరుగారు 'భగీరథప్రయత్నం' చేశావు రా అన్నారు) పండగ కదా అని తమలపాకులు వేసుకొందుకు పర్మిషన్ దొరికింది. అందరికీ తెలిసి రెండాకులు, ఒక వక్క. బ్లాకు మార్కెట్టుగా నాలుగాకులు, ఒక వక్క, అక్కయ్యిచ్చింది ఎవరూ చూడకుండా.

పొట్టబరువు తగ్గగానే అక్క పేరంటాళ్లని పిలవడానికి బయలుదేరింది. వెంట, నేను తోడు, మగవాణ్ని! కొందరిళ్లల్లో, అక్కయ్యీడువాళ్లు అప్పుడే ఇచ్చేశారు వాయనం. నానెత్తిన పడింది శనగలు మోయవలసిన భారం!

ఇంటికొచ్చింతరవాత తమలపాకులు పట్టీలు కట్టడం. పూచిక పుల్లలు నేనే చీరాను. రెండాకులు, రెండు పచ్చొక్క ముక్కలు ఒక పట్టీలో. కడ్తాన్నంతసేపూ నా దవడ ఆడుతూనే వుంది! పనంతా అయేసరికి రెండైంది. అమ్మ వంటింట్లోనే పీటవాల్చి, దానిమీద తలవుంచుకుని నడుంవాల్చింది అమ్మ నిద్రపోయిన అదనుచూచుకొని అక్కయ్య 'పత్రిక' తీసింది. నేమా బొమ్మలు చూశాను.



ఆట కత్తెలు
బి.రా యశోద (15) చోడవరం.

# ★ శ్రావణ మంగళవారం ★

ఇంతలో రామారావొచ్చాడు. నాలుగైంది. "బడికి రాలేదేంరా?" అన్నాడు.

"అవును" అన్నా ధీమాగా.

"ఆడుకుందుకు రావా?"

"ఊ......హూఁ..."

ఎక్కిరించి వెళ్లిపోయాడు వాడు. ఆడవాళ్లు మాట్లాడుకుంటూంటే వినాలని సరదా నాకు. "శశీ" అన్నారెవరో.

తలెత్తి చూసేసరికి నటరాజన్, పక్కింటి శకుంతలమ్మ గారి కొడుకు.

"ఏన్నాడా?" అన్నా.

నేను అరవం మాట్లాడటం చూసి ఇకిలించాడు 'నటరాజన్'

మొహం కడుక్కున్నా సబ్బుతో. అక్క పౌడర్ రాసి కొత్తచొక్కా లాగూ తొడిగింది.

చల్లపడింది. వాకిట్లో రైలాటాడుకుంటున్నారు పిల్లలు. దుమ్ము రేగుతోంది.

పేరంటాళ్లంతా వచ్చారు. మా తెలుగుమేష్టారి పెళ్లాం పాటపాడింది ఒకసారి. రెండుబొమ్మలు చూశారు. "అందానికి నేను, సంగీతానికి మా చెల్లాయి" అని వుంది. ఒకటి వొంకె, మరొకటి గాడిదా! గుర్తొచ్చి నవ్వుకున్నా. అక్క, అమ్మ, అత్తయ్య వచ్చిన వారందరికీ పసుపురాసి, గంధం పూసి, బొట్టుపెట్టి శనగలిచ్చారు.

పిల్చినవాళ్లంతా వెళ్లారు. పిల్లలు చేసిన అల్లరి తగ్గింది. "శకుంతలత్తయ్య గారు రాలేదురా



తల్లులూ పిల్లలూ :

చిత్రకారుడు :—కురజాడ దుర్గాప్రసాదరావు (6) స్కూల్ ఆఫ్ ఆర్ట్స్ అండ్ క్రాఫ్ట్స్, విజయనగరం.

ఇంకా" అక్క వాకిట్లోకి చూస్తూ "వెళ్లి కేకేస్తావురా?" అంది.

ఒక్కపరుగున నటరాజన్ గారింటికెళ్లా. ఆడుకునేందుకు వెళ్లి, ఇంకా రాలేదు కాబోలు, ఇంట్లో లేడు. వంటింటి గుమ్మంలోకెళ్లి "ఎన్నాంగో మామిగారూ!" అన్నా.

ఆవిడ కుంపటిమీద చారుపెట్టి తీరుబడిగా కూర్చుంది, ఎదురుగా పీటమీద. నేను పిలవటం విని గుమ్మంవైపు తిరిగి "ఏమిరా?" అంది.

"అక్క పేరంటానికి పిల్చుకు రమ్మంది"

"నీవుపో, నే నిప్పుడే వస్తును" నాకు నవ్వొచ్చింది. నాకొచ్చిన అరవమంతకూడా రాదు, అత్తయ్యగారికి తెలుగు!

పావుగంటైంతరవా తొచ్చింది.

"ఏమండీ ఆలస్యమయిందేం" అమ్మ అడిగింది పసుపురాస్తూ. అక్క బొట్టుపెట్టి శనగలిచ్చింది.

"రసం కాగుతూందండీ పొయ్యిమేల, చారు మరుగుతేదా మాకు బాగుండదండీ"

"చారు కాగినకొద్దీ రుచం టారు కదుటండీ మరి" అంటూ అత్తయ్య ఆవిడ దగ్గరగా జరిగింది.

"యారు సెప్పినారండీ? పొంగకముందుదాచారు దించి వేయవాల, లేకపోతే పొగకంపు వేస్తది!"

"అత్తయ్యగారికి, అప్పడానికి నెయ్యిరాసి తెచ్చియ్యవే" అంది అమ్మ, అక్కవంక చూసి.

అప్పడం తింటూ "అప్పడందా పెట్టూంటే నోరు బాగా చేసారను కుంటిని అడడా... ఇదియేమి అప్ప డబ్బా రొంబకారమా ఇరుకుదె?" అందావిడ నడినెత్తిన కొట్టుకుంటూ (కారం నెత్తికెక్కి)

అమ్మకీ అత్తయ్యకీ మనుషుల కొచ్చినంత కోపం వచ్చింది! నాకూ వచ్చింది, లేకపోతే ఏమిటి మరీ, నిక్షేపంలాంటి అప్పడాల్ని తిడుతూంటే.

"కారంగా వున్నాయా?" అంది అమ్మ కోపమాపుకుని.

"అప్పడమంటే ఇలాగ కాదండీ



వాలు జడ

కాశీనాదుని లక్ష్మీనరసాదేవి (7)
తాడేపల్లి గూడెం.

## శ్రావణ మంగళవారం

చేయడం, పిండి ఆముదముతో మెత్తగా మర్దన చెయ్యాలి. నల్లేరురసంతో పిండి నాలుగు గంటలు నలగ కొట్టవాలి. అప్పుడుదాం వోత్తవాల. అసలు కారమే వెయ్యరాదండి" అందావిడ అక్కఇచ్చిన మంచి నీళ్లు తాగుతూ.

"అలాగా" అందత్తయ్య ఆవిడ చెప్తూన్నంతసేపూ ఆపళంగా నోరు తెరుచుకుని.

"ఇంకనే పోయివస్తును" అంటావిడ గుమ్మందాటుతూ. అన్నంతిని, తాంబూలం వేసుకుని మబ్బుగా లేదుకదా అని డాబామీది కెళ్లా. బిచానా పరుచుకుని హాయిగా పడుకున్నా. చల్లగా వెన్నెలా, జలజలా రాలిపోతున్నాయేమో అన్నట్లు మినుకు మినుకుమనే నక్షత్రాలు. మగతగా నిద్ర మత్తొచ్చింది. చల్లగా మల్లెపందిరిమీది నుంచొచ్చేగాలి జోకొట్టింది. హాయిగా నిద్రపోయాను, శ్రావణ మంగళవారం పరమాన్నాన్ని గుర్తుచేసుకుంటూ. ★

# పుణ్యమెవరిది?

ఎమ్. వి. ఎస్. ఆర్. శర్మ (12) కాటూరు.

పాతరోజుల రాజొకడు
జాతికంతకు ఖ్యాతి తేగల
దేవళం కట్టించవలెనని
పూనుకున్నాడు.

రాజు దలచిన కొదవ ఏమిటి ?
మోజుమీరగ వ్యయప్రయాసలు
లెక్కచేయక చక్కగా గుడి
పూర్తిచేశాడు.

నిక్కముగ ఇటువంటి మందిర
మెక్కడుందని జనులు పొగడగ
చక్కగా తనపేరు ద్వారం
పైన కూర్చాడు.

ఉత్సవాలూ సంబరాలూ
పచ్చపచ్చగ మెప్పుమీరగ
హెచ్చు అలసటచేత భూపతి
నిద్దరోయాడు.

నిదురలో కల ఒకటికన్నా
డెదురుగా తన మందిరం అది.
కాని ద్వారంపైన పేరొక
ఆడుదానిదిగా !

రాజు అచ్చెరువంది రెండవ
రోజు భటులను రాజ్యమంతా
వెదకి ఆవిడ ఎక్కడుందో
తెండి అన్నాడు.

భటులు కాటికి కాళ్లుజాచిన
కటిక ముదుసలి పేదరాలిని
ఒక్కతెను ఆ రాజు ముందుకు
తోడితెచ్చారు.

మందిరం కట్టటానికి నీ
వంద చేసిన సాయమేమిటి ?
ఎందుకో నీపేరు ఉందని
రాజు అడిగాడు.

మందిరానికి రాళ్లుమోస్తూ
కుందిపోయిన ఎద్దులకు నే
మేత వేసిన మాట నిజమని
అవ్వ పలికింది.

కీర్తికోసం పాటుబడితే
ఆర్తిబాపినదామె అని ఆ
రాజు ముదుసలియామె పేరే
చెక్కమన్నాడు.

# బాటసారి

[కాశీ మజిలీ కథలూ; అరేబియన్ నైట్సు కథలూ నిజంగా జరిగినవి కావు. అవి కాలక్షేపం కోసం చేసిన కట్టుకథలు వాటిని గురించి ఎక్కువగా ఆలోచించ కూడదు—రచయిత]

అప్పటికి జానపదయుగం అంతరించి, నవనాగరికయుగం ప్రవేశించింది.

అదొక చిన్న రాజ్యం. ఆ రాజ్యాన్నేలే రాజునకు యుక్త వయస్సు వచ్చిన కుమారుడొక్కడే ఉన్నాడు కాని ఆ యువరాజా వారిది ఒట్టి వక్రబుద్ధి తా పట్టిన కుందేటికి మూడే కాళ్ళని వాదించే తిక్క శంకరయ్య.

యువరాజా వారి గదిలో బోలెడన్ని కాశీమజిలీ కథలు, అరేబియన్ నైట్స్ వున్నాయి. వాటిని చదివిన ఆ రాజకుమారునకు ఏవేవో పిచ్చిపిచ్చి ఆలోచనలు కల్గాయి. ఆ కథల్లోని రాకుమారులు, వుద్యానవనాలు, రాకుమార్తెలు, బ్రహ్మ రాక్షసులు, దేవ కన్యలు, అప్సరసలు, మాంత్రికులు, పేరాసి పెద్దమ్మలు, కత్తి యుద్ధాలు మొదలైనవెన్నో ఆతని వక్రబుద్ధిని పరుగులెత్తించినై...

బైటనుండి రైళ్ళ అరుపులు, కారు హారన్లు, సైకిలు బెల్లులు, రేడియో అరుపులు, "మా మధ్య నువ్వున్నావ్ సుమా" అంటూ హెచ్చరిస్తున్నాయి.

చివరికెలాగైతేనేం మన యువ రాజావారి బుద్ధే గెలిచింది. ఈకలియుగంలో, ఆ రాకుమారులవలె, అద్భుతాలు, అత్యద్భుతాలు చేసి, ఆ రాకుమారుల జాబితాల్లో తను కూడా చేరాలనిపించింది యువ రాజాగారికి. వెంటనే బయల్దేరా లనుకున్నాడు. కాని ఎలా?...

---

వడ్డాది
సత్యనారయణమూర్తి (14)
విజయనగరం.

---

ఎక్కడికి?...పూర్వపు రాకుమారులైతే తలిదండ్రులతో చెప్పకుండా పారిపోయి దేశాటనం చేసేవారు. ఇతనికి కూడా అదే బుద్ధి పుట్టింది. ఆరాత్రే బయల్దేరాలనుకున్నాడు. అందాకా ఏమేమో ఆలోచనలతో కాలం గడిపాడు.

ఎలాగైతేనేం రాత్రి ప్రవేశించి, అర్థరాత్రికూడా అయింది. అప్పుడే మన రాకుమారుడు ప్రయాణానికి కావలసిన ఏర్పాటు చేసుకున్నాడు. ఇంతలో అతనికి ఒక



"బోటు"

చిత్రకారుడు గురజాడ దుర్గా ప్రసాదరావు, (8) విజయనగరం.

వంతుడా!" అని బెదరిపోయాడు యువరాజు మెల్లగా బెదరుతూ లేచి, ధైర్యం చిక్కబట్టుకుని, "ఏయ్! ఎవరు మీరు! మీకు కళ్లు నెత్తిమీద కొచ్చాయిరా! నే నెవర్నో తెలుసా! రాజకుమారుణ్ణి" అన్నాడు. "ఐతే మన కిక లోటే లేదు" అంటూ వాళ్లు పాపం మన రాకుమారుణ్ణి చితకబాదిచి ఉన్న డబ్బును, బట్టల్ని, గుఱ్ఱాన్ని లాక్కుని, మామూలు బట్టలు కట్టబెట్టి చక్కాపోయారు. "దొంగలైతే ఎవర్నో ఒకణ్ణి కత్తియుద్ధానికి నామీదకు పంపి, నేను గెలిస్తే నన్ను దొంగల నాయకుణ్ణి చేస్తారేమో అనుకున్నా గానీ ఇలా చేస్తారనుకున్నానా!" అని విచారిస్తూ రోడ్డెక్కాడు రాకుమారుడు. అప్పటికి బాగా తెల్లవారింది. మన యువరాజావారు అలా నడచి నడచి ఒక పట్నం చేరుకున్నాడు. అప్పటికి బాగా ఎండెక్కింది. కాని, ఇంత దెబ్బ తిన్నా, మన రాకుమారుడుగారికి తనలోని వాంఛ చావలేదు. ఈసారి అతనిదృష్టి పేరాసి పెద్దమ్మగారివైపు పోయింది. తోవలో ఎన్నో హోటళ్లు కనబడ్డాయి. కాని అవేం నచ్చలేదు మన యువరాజాగారికి. ఎంచేతనంటే మనవారికి పేరాసి పెద్దమ్మ హోటలే కావాలి!...

ఎలాఐతేనేం మన యువరాజు గారికి ఒక హోటేలు నచ్చింది. దానిమీద "అన్నపూర్ణ భోజన హోటల్" అని వుంది. ఆడదాని పేరుందికదా! ఐతే అది తప్పకుండా పేరాసి పెద్దమ్మ ఉన్న హోటలే ఔతుంది" అనుకున్నాడు యువరాజు.

డబ్బుకోసమని మాసిపోయిన లాల్చీ జేబులు తడువుకొన్నాడు. అరె! జేబులో వందరూపాయల నోటు వుంది ఆశ్చర్యంగానే కనిపించింది! ఆ దొంగల తెలివితక్కువకి ఒకసారి నవ్వుకున్నాడు యువరాజు. "తెలివితక్కువ వెధవలు! వంద రూపాయలు జేబులో పెట్టి, మర్చిపోయి ఆలాల్చీనే నాకు ముట్టజెప్పారు. మరి అన్యాయంచేస్తే



కోతి బావ
చిత్రకారిణి: వేమూరి లక్ష్మి, (18) న్యూఢిల్లీ.



మా మేష్టారు

ముప్పుంట వెంకటసత్యవిమల, (5)

విజయవాడ.

## ★ బాటసారి ★

ఏమౌతుంది?" అని గొణుక్కున్నాడు తనలో తాను.

మెల్లగా హోటల్లో అడుగు పెట్టాడు. కాని, తను అనుకున్నట్లు ఆ హోటల్లో పేర్రాసి పెద్దమ్మ లేదు. ఎదురుగా టేబిల్ ముందు కుర్చీలో కూర్చున్న మేనేజర్ కనబడ్డాడు. "ఏడి తస్సాదియ్యా! శనిలా విడెంటీ ఎదురుగా" అని విసుక్కున్నాడు యువరాజు "కాని ఎవరైతేనేం ఈతన్నే పెద్దమ్మగా భావించుకుందా" మనుకున్నాడు.

మెల్లగా మేనేజరువద్దకు పోయి "అవ్వా! అవ్వా! నాకీపూట భోజనం పెడతావా?" అన్నాడు యువరాజు. దాంతో హోటల్ యజమానికి క్రెత్తుకొచ్చింది "ఏరా! నీకు కళ్లు చినపడటం లేదూ! ఆడ దెవరో మగా డెవరో తెలియటం లేదురా ఫూల్! ఫో! అవతలకి" అంటూ మెడపట్టుకుని గెంటాడు. పాపం! మన యువరాజావారిని చూచి ఆ హోటల్లో భోజనం చేస్తున్న వాళ్లందరూ కడుపులు పట్టుకుని నవ్వసాగారు కార్యదీక్షా నిమగ్నులై యున్న యువరాజావారికి ఇంకా తన మొలలో కత్తి వున్నట్టుగానే వున్నది. "ఓరీ! నిన్ను నా కత్తితో ఇదే ముక్కలుగా కోసెదను. కాచికొమ్మ"ని ఒరలోనించి కత్తి దూయ బోయాడు. కాని మొలలో కత్తి ఒరా, వుంటేగా! పాపం! వాళ్లందరూ నవ్వుతో వుంటే తనుచేసే దేమీలేక తలవొంచుకుని చక్కాపోయాడు యువరాజు.

మొత్తంమీద ఎలా ఐతేనేం ఏదో హోటల్లో భోజనం చేశాడు క్రమేపీ సాయంత్రం అయింది. ఎక్కడైనా ఒక్క వుద్యానవనం అగుపడుతుందేమోనని తిరిగాడు. అటువంటి దేమీ అగుపడలేదు కాని ఒకచోట చక్కనిపార్కుమాత్రం కనబడింది. గబగబా దాంట్లోకివెళ్ళి చూచాడు చుట్టూను. అక్కడ మన యువరాజుకి ఒక్క దేవకన్యగాని, అప్సరసగాని ఎవ్వరూ కనపడలేదు. ఛీ! వెధవవనం! అని చీదరించుకుని అక్కడనుండి వెళ్లిపోయాడు.

ఆరాత్రికి వూరువిడిచి పోయామంటే మళ్లా ఏదైనా ప్రమాదం వస్తుందేమోనని ఆ రాత్రికి ఆవూళ్లోనే వుండిపోయాడు యువరాజు. ఒక సత్రవు అరుగుమీద పడుకుని ఆలోచిస్తున్నాడు. ఇంతలో దూరాన్నుంచి విమానం వస్తున్న చప్పుడు వినవచ్చింది అటువైపు దృష్టి నిలిపి చూచాడు యువరాజు. ఆకాశంమీద ఒక ఎరుపులైటు, పచ్చలైటు కనపడ్డాయి మనవాడికి. అవి తనవేపుకే వస్తున్నాయి మన యువరాజుగారికి ఎలక్ట్రిక్‌షాక్ తగిలినట్లయింది. "ఇంకేం! అవి నిజంగా దేవకన్యలయొక్క విమానాలే. నన్నెలా దేవలోకానికి వాళ్ళు తీసుకుపోతారో చూదామ"ని టక్కున నిద్రవేశాడు యువరాజు. అలా 5 నిమిషాలసేపు నిరీక్షించాడు. కాని ఆ విమానం ఎంతకీ భూలోకంలో ఉన్న తనదగ్గరకు దిగందే! పైగా ఎటో ఉడాయించేస్తోంది కూడాను. "ఛీ! వెధవ కలియుగం!" అని తిట్టుకున్నాడు యువరాజు.

భళ్లున తెల్లవారింది యువరాజుకు తెలివివచ్చింది. గబగబా కాలకృత్యాలు తీర్చుకుని, ఏహోటల్లోనో ఇంతఫలహారం చేసేసి, మళ్లా బయల్దేరాడు ఈసారి ఆతనిదృష్టిని రాకుమార్తెలు ఆకర్షించలేదు... ఆ రాకుమార్తెలేనా అలాంటిలాంటి

వారు ఎవరో కారు బ్రహ్మరాక్షసులు గుప్తంగా తీసుకువచ్చి తమ మేడలలో పెంచుకొనే రాకుమార్తెలు వారు "వీళ్లెక్కడ దొరుకుతారా" అని ఆలోచించుకుంటూ, వూరి చివరకు వెళ్లాడు.

అక్కడ యువరాజాగారికి ఒక పెద్దమర్రిచెట్టు కనిపించింది. దాన్ని చూడగానే మన రాకుమారుడికి చటుక్కున ఒక కథ జ్ఞాపకానికొచ్చింది. పూర్వమొక రాకుమారుడు ఇలాంటి మర్రిచెట్టునే ఎక్కి, దాని కొమ్మ పట్టుకుని, దాని వెంబడే పోయి, ఒక బ్రహ్మరాక్షసి మేడలో యున్న రాకుమార్తెను రక్షించి, పెండ్లి చేసుకుంటాడు. ఈ సంగతి జ్ఞాపకం రాగానే మన రాకుమారుడు చంకలు గుద్దుకొని, చుట్టూరా చూచాడు ఏదైనా మేడవుందేమోనని. అరె! బలె! రాకుమారుడనుకున్నట్లుగానే అంతా సరిపోయింది! ఆ మర్రిచెట్టుకు దగ్గరలోనే ఒకబంగళా ఉంది. ఈమర్రిచెట్టు తాలూకు మ్రాను ఒకటి ఆ బంగాళామేడ తాలూకు పిట్టగోడమీదకు వ్రాలియుంది

"ఇంకేం! బలే అవకాశం చిక్కిందనుకున్నాడు, యువరాజు గబగబా చెట్టెక్కేసి, ఆ మ్రాను వెంటే మేడమీదకు చేరాడు ఆ మేడమీద మూడే గదులున్నాయి ఒక గదిలోకి కిటికీ ద్వారా తొంగి చూచాడు. ఇంకేం! రాకుమార్తె లాంటి ఒక సుందరి పడుకొనివుంది జానపదయుగంలో ఉన్న రాకుమారుని బుద్ధికి ఆ సుందరి ఒక బ్రహ్మరాక్షసిచే తేబడ్డ రాకుమార్తెలా కనబడింది "ఆహా! ఏమి నా అదృష్టం! అతిలోకసౌందర్యం! అపరరతీదేవి! ఇన్నాళ్ళకు నేననుకున్న కార్యం సాధించాను ఇంకేముంది కాశీమజిలీ కథల పుస్తకాల్లో నా కథ కూడా 'అనగా అనగా' అని ప్రారంభమై తన రతీదేవితో కూడా అటు మామగారి రాజ్యాన్ని (అంటే ఇప్పుడు పడుకున్న సుందరియొక్క తండ్రి రాజ్యాన్ని) ఇటు తన తండ్రి రాజ్యాన్ని, చిరకాలం పాలిస్తూ, సుఖంగా వుంటాడు అని అంతమౌతుంది ప్రజలందరు నే బ్రతికుండగానే నా కథను చదివి ఆనందిస్తారు. ఈ కలియుగం ఒక్కసారిగా జానపదయుగంలోకి నాచే కొంటింపబడుతుంది. ఈ దెబ్బతో ఈ తెల్లవాళ్లు మన దేశం విడిచి పారిపోవాలి వెధవలు వీళ్లొచ్చాకనే మన దేశం పాడైంది (అప్పటికింకా మనకి స్వాతంత్ర్యంరాలేదు.) ఇంక ఆలోచన్లి కట్టిబెట్టి, యువరాజావారు కిటికీ గుండా ఆ సుందరి గదిలోకి వెళ్ళి, సుందరి మంచంపై కూర్చుని, "రాజకుమారీ!" అని సంబోధించి లేపాడు. పాపం! ఆ అమ్మాయి త్రుళ్ళిపడి లేచి, ఆపాదమస్తకం మాసిపోయి బికారివాడిలా వున్న యువరాజుని చూచింది. ఏ డెవడో దొంగలా గున్నాడనుకుంది. తనగొంతుకలో ఉన్న శక్తినంతటినీపోగుచేసి, "ఎవరునువ్వు?" అని బిగ్గరగా అరచింది



మూషికలోకంలో దసరావిందు

చిత్రకారుడు ఎ వెంకటరావు, ($14\frac{1}{2}$) ఖరగ్‌పూర్.




ఈ అరుపుతోనైనా మన యువరాజావార్కి తెలివి రాలేదు. (అంటే జానపదయుగపు మైకం పూర్తిగా కమ్మిందిలెండి!) పూర్వపు రాకుమార్తెలు పరపురుషుణ్ణి చూడగానే మూర్ఛపోయేవారట. ఇంకా ఆపాటీపాటి పురుషవాసనని చూచినవారయితే "ఎవరు నువ్వు? ఎందుకొచ్చావిక్కడికి?" అని దండించేవారట! ఇక మూడోరకంవాళ్ళు, అంటే జాలిగుండె కలవాళ్ళు, లేకపోతే ఆ రాజకుమారుని చూచిన వెంటనే ప్రేమానురాగం కలిగినవాళ్ళు "నువ్వెందుకొచ్చావిక్కడికి? నువ్వెలా రాగలిగావు? నిన్నా బ్రహ్మరాక్షసి చూచిందంటే చంపేస్తుంది" అని అంటుంటే ఇంతలో "నరవాసన! నరవాసన!" అని కేక లేసుకుంటూ బ్రహ్మరాక్షసి రావడం, వెంటనే ఆ రాకుమారి, ఆ రాకుమారుణ్ణి బల్లిగానో, ఏదో పక్షిగానో మార్చేయటమూ చేసేవారట! ఇంకా ఇంకా ఎన్నోరకాలున్నాయి ఈ మూడింటిలో ఏదో ఒకటి వాడుతుందనుకున్నాడు రాకుమారుడు. కాని, ఈ కలియుగపు రాకుమారి మధ్యరకంలో మొదటి మాటను వాడటంచేత మరింత నమ్మకం కలిగింది యువరాజుకి. "రాజకుమారీ! నేనొక రాజు కొడుకుని తండ్రితో చెప్పకుండా దేశాటనం చేస్తూ, అనేక కష్టాలకు లోనయి ఆఖరికి ఈ దేశంలో నీవద్దకు......" ఇంకా యువరాజుమాట పూర్తి గాకుండానే మరింత హెచ్చుస్థాయిలో వచ్చాయి మాటలు. "చటప్! దొంగ వెధవా! మా నాన్నగానీ చూశాడంటే చంపేస్తాడు తెలుసా? ఇకనైనా వచ్చిన త్రోవను ఫో!..." అంటూ దారి చూపించింది. దాంతో రాకుమారుడిలోనున్న ఆశలన్నీ విజృంభించాయి. ఆ అమ్మాయి వాడిన "నాన్న" అనే పదం బ్రహ్మరాక్షసిగా వినిపించుకున్నాడు రాకుమారుడు. మహా గంభీర ఘనభావాలతో ముఖం కందగడ్డలా చేసుకుని "ఓ రాజకుమారీ! నేనెవరోన్న తెలుసా? ఏకైకవీరుణ్ణి. వంద పెద్దపులుల్ని సునాయాసంగా ఒక్క కత్తితో చంపగలను. ఇక విలువిద్యలో అర్జునుడి ముత్తాతనని పించుకున్నా. తెలుసా? చెప్పు! వెంటనే చెప్పు! ఆ బ్రహ్మ రాక్షసి ప్రాణా లెక్కడున్నాయో. దాన్ని చంపివేసి, నిన్ను రక్షించుకుంటా!" అలసిపోయినట్లుగా వగర్చుతూ ఆగాడు యువరాజు. ఆ అమ్మాయికి బలే చిక్కే వచ్చింది. "ఈ శని వెధవ ఇలా పోయేట్టు లేడు. వీడిరోగం చప్పగా కుదర్చాలి" అని తనలో అనుకుని, పైకి వినయం నటించి, "అబ్బా! అంత గొప్పవాడివా? ఈసంగతి మొదటనే చెప్పలేదేం?... ఉండు ఇప్పుడే వస్తా!" అంటూ క్రిందకుదిగి వెళ్ళింది. చిక్కి శల్యావస్థలోనున్న రాకుమారుని మనస్సుకు, ఆశయాలకు బలం చేకూరింది. చెప్పలేని సంతోషం బలం చేకూరాయి అతనికి.

ఇంతలో క్రిందకు దిగివెళ్ళిన అమ్మాయి నలుగురు పోలీసుల్ని వెంటబెట్టుకుని వచ్చింది. వాళ్లని

చూడగానే యువరాజావారు ఈలోకంలోనికివచ్చి పడ్డారు. మనిషి మామూలుగానే వున్నాడు. గాని, మరేదో క్రొత్తమైకం రాజకుమారుడ్ని ఆవహించింది. ఆ మైకంలో తనెక్కడవున్నాడో, ఏం చేస్తున్నాడో తెలియలేదు. అంతే! మళ్లా తెలివి వచ్చి చూసుకునేసరికి తను ఖైదులో వున్నట్లు తెలుసుకున్నాడు.

ఆ జైలు వార్డర్ చెప్పాడు "నీకు ఆరునెలలు ఖైదు" అని. పాపం! యువరాజు మొదలంటా కృంగిపోయాడు.

కాని ఇంతటితో వీడి మత్తు వదులుతుందనుకున్నారేమో! అబ్బే! అలాంటిదేమీ జరగలేదు సరికదా కాస్త ఎక్కువైంది కూడాను.

మన యువరాజావారికి ఒక కథ జ్ఞాపకానికి వచ్చింది. "పూర్వం ఒక శత్రురాజు దగ్గరికి ఒక రాకుమారుడు వెళ్లితే, ఆ రాజు ఆ రాకుమారుణ్ణి ఖైదులో పెడితే, ఆ రాజుకూతురు, ఆ రాకుమారుణ్ణి ప్రేమించి, అతణ్ణి ఖైదునుండి చాటుగా విముక్తుణ్ణి చేస్తుంది."

ఈ ఆశతోనే ఆరునెలలూ ఎదురుచూచేడు యువరాజు. కాని ఒక్క అమ్మాయికాదుకదా ఒక్క అబ్బాయేనా తన వేపు రాలేదు.

ప్రభుత్వం ఆరునెలలూ అయినాక ఖైదునుండి విముక్తుణ్ణి చేసింది యువరాజుని.

ఈమాటు ఇతని బుద్ధి మునుల వేపు పోయింది. "మునులనడిగితే ఏదో త్రోవ చెపుతారు. అల్లకొండలో గుప్తంగా మణివుందనో, లేక పాతాళంలో ఏదోశక్తివుందనో లేక మరేమేమో... చెప్పక పోతారా" అని ధైర్యంచేసి మునులను అన్వేషిస్తూ బయలుదేరాడు యువరాజు.

చిట్టచివరకి మునిలాగే వున్నాడు ఎవరో బైరాగి. రాతిమీద కూర్చుని దేవుణ్ణి ప్రార్థిస్తున్నాడు. మనయువరాజుకి రత్నాలగని దొరకినట్లయింది. త్వరగా ఆ బైరాగి వద్దకు పోయి, నమస్కారం చేస్తూ, "స్వామీ! స్వామీ!" అని పిలిచాడు.

కాని బైరాగి కళ్లు విప్పలేదు. ఆ తొందరలో తొందరగా కోపం కూడా వచ్చేసింది యువరాజుకి. పూర్వపు రాకుమారులైతే కోపంతో, చచ్చిన పాముని మునుల మెడలో పడేసేవాళ్లుట. తనకక్కడ చచ్చిన పాము కాదుగదా బ్రతికినదైనా కనపడలేదు. ఈ విధంగా యువరాజు సందిగ్ధావస్థలోనుండగా ఆ బైరాగే కళ్లు విప్పి చిరునవ్వుతో ఆహ్వానించాడు. "ఎవరు నాయనా నువ్వు?" మృదువుగా అన్నాడు బైరాగి. యువరాజు తన చరిత్ర అంతా చెప్పి, 'ఏదేనా మార్గోపదేశం చేయండి స్వామీ!" అని బ్రతిమలాడేడు బైరాగిని.

అప్పుడు బైరాగి ఇలాఅన్నాడు "నాయనా! అజ్ఞానం, జ్ఞానం అనే రెండు పెద్దబాటలున్నాయి. 'అజ్ఞానం' అనే బాటలో తెలివితక్కువ, దుర్మార్గం, అవినీతి, అబద్ధం, దుర్గుణాలనే పిల్లబాటలున్నాయి జ్ఞానం అనే బాటలో సన్మార్గం, నీతి, న్యాయం, ధర్మం, సౌశీల్యం అనే సుగుణాల బాటలున్నాయి నువ్వు అజ్ఞానం అనే బాటగుండా పోతున్న బాటసారివి. అసలాబాటలో మంచిని గురించి ఆలోచించే శక్తే వుండదు. ఈ కాశీమజిలీ కథలు, అరేబియన్ నైట్సు, నిజంగా జరిగినవి కావు. స్వార్థపరులు కాలక్షేపంకోసం చేసిన కట్టుకథలు. వాటినిగురించి ఎక్కువ ఆలోచించకూడదు. వెళ్లు! ఇకనైనా అజ్ఞానం అనే బాటనుండి, జ్ఞానం అనే బాటమీదకు పోయి సుఖించు" అని మృదువుగా నవ్వి వీపు నిమిరాడు బైరాగి. మన యువరాజుకి అజ్ఞానం అనే బుర్ర తీసేసి జ్ఞానం అనే బుర్ర తగిల్చినట్టయింది. వెంటనే దుఃఖంతోటీ సంతోషంతోటీ కల్తీఅయిన కన్నీళ్లను తుడుచుకొని, స్వామికి నమస్కరించి "సామీ! నన్ను అజ్ఞానం అనే బాటనుండి జ్ఞానం అనే బాటపై పడవేసిన మీకు ఇదే నా నమస్కారం" అని చెప్పి, మునివద్ద శలవు తీసుకుని, జ్ఞానం అనే బాటగుండా పోతున్నాడు యువరాజు. కాదు... కాదు... "బాటసారి" ...



# డబ్బు చెట్టు

దసరా రోజులంటే నా చిన్నతనంలో జరిగిన ఒక సంఘటన గుర్తుకొస్తున్నది. అదేమిటో చెప్పమంటారా? అయితే వినండి.

అవి నేను ప్రయివేటుస్కూలులో చదువుతున్న రోజులు : ఐదో క్లాసులోకి ఆమేడే వచ్చాను మానాన్నగారు కొత్తగా ఒక పుస్తకాలషాపు పెట్టి నడుపుతున్నారు. ఇంట్లో గారాబంగా పెరగటంమూలంగా నాకు మా అమ్మన్నా, నాన్నన్నా అంత భయం వుండేదికాదు. మా తాతగారియిల్లు కూడా మా యింటికి ప్రక్కనే వుండేది. వాళ్ళింటికి, మాయింటికీ ఒక్కగోడే అడ్డం. అందుచేత వారియింటికి మేము మాయింటికి వాళు, రాకపోకలు జరుగుతుండేవి.

ఒకరోజున మాయింటికి ఎవరో ఒక ముసలాయనా, ఒకకుఱ్ఱవాడు, ఇద్దరూ వచ్చారు. వాళ్లు మానాన్నగారితో చాలాసేపు మాట్లాడి వెళ్లారు. మానాన్నగారు భోజనము చేస్తూ, ఆఅబ్బాయి "యస్. యస్, యల్. సి" చదువుతున్నాడనీ. స్కూలుజీతం కట్టటానికి కూడా చాలా బాధపడుతున్నాడనీ, అందుచేత ఈపడాది తిండి ఖర్చు తను భరిస్తానన్నానని మా అమ్మతో

"ఇష్టాగోష్ఠి"

చి|| త్రకారుడు • మురళీకృష్ణారావు (12) సిదిపేట, గవర్నమెంట్ హైస్కూలు విద్యార్థి,



చెప్పారు. ఇంతలో మా ముగ్గురు మామయ్యలూవచ్చి, వాడికి తాము తమయింట్లో భోజనం పెట్టా మనీ జీతమూ, పుస్తకాల ఖర్చు మానాన్నని భరించమని చెప్పారు. అంతా కలిసి 'సరే' నంటే 'సరే' అన్నారు.

అంత చిన్నతనంలోనే వాడు యస్. యస్. యల్. సి. చదువు తున్నాడని, నన్ను ఎక్కిరించేవాళ్లు మావాళ్లు. నాకు చాలా సిగ్గేసి చాలాశ్రద్ధగా చదువుతుండేవాణ్ణి ఆ కుఱ్ఱవాడు మా మామయ్యగారింట్లో దిగాడు. మా నాన్నగారు వాడికి కావలసిన పుస్తకాలన్నీ కొట్లోనుంచి తెచ్చియిచ్చారు. అతని పేరు రామ్మూర్తి. వచ్చిన మరు

వారణాసి సుబ్రహ్మణ్యశర్మ (15)
గుడివాడ.

నాటినుంచీ అతను నాతో కలసి మెలసి మాట్లాడేవాడు.

ఒక రోజు రామ్మూర్తి నాతో డబ్బులు పాతిపెడితే చెట్లు మొలుస్తాయనీ, ఏ డబ్బు పాతిపెడితే ఆ డబ్బు కాస్తుందనీ చెప్పాడు ఎల్లాగైనా ఒక్క అర్ధరూపాయి పాతి పెడితే, అదిఅర్ధరూపాయలు కాస్తుదని మాటిమాటికీ అమ్మనీ నాన్ననీ డబ్బులు అడక్కుండా పోతుందనీ అనుకున్నాను. నాన్న నడిగితే అణాకంటే ఎక్కువ యివ్వరు. ఏది కావలసినా కొని యిస్తారు గానీ డబ్బు యివ్వరు.

మరునాడు రామ్మూర్తి 'డబ్బు పాతిపెట్టావా?' అని అడిగాడు. లేదని సిగ్గుతో అన్నాను మధ్యాహ్నం మా నాన్నగారు అన్నానికి వచ్చినప్పుడు కలం, పర్సు, కళ్ళ

"అలు మగలు"

(మహాబలిపురంలోని శిల్పం) ఫోటో వీరపనేని కుటుంబరావు, మద్రాసు



చూడగానే యువరాజావారు ఈలోకంలోనికివచ్చి పడ్డారు మనిషి మామూలుగానే వున్నాడు. గాని, మరేదో క్రొత్తమైకం రాజకుమారుడ్ని ఆవహించింది. ఆ మైకంలో తనెక్కడవున్నాడో, ఏం చేస్తున్నాడో తెలియలేదు. అంతే! మళ్లా తెలివి వచ్చి మాసుకు నేసరికి తను ఖైదులో వున్నట్లు తెలుసుకున్నాడు

ఆ జైలు వార్డర్ చెప్పాడు "నీకు ఆరునెలలు ఖైదు" అని. పాపం! యువరాజు మొదలంటా కృంగిపోయాడు

కాని ఇంతటితో ఖైదీ మత్తు వదులుతుందనుకున్నారేమో! అబ్బే! అలాంటిదేమీ జరగలేదు సరికదా కాస్త ఎక్కువైంది కూడాను

మన యువరాజావారికి ఒక కథ జ్ఞాపకానికి వచ్చింది. "పూర్వం ఒక శత్రురాజు దగ్గరికి ఒక రాకుమారుడు వెళ్లితే, ఆ రాజు ఆ రాకుమారుణ్ణి ఖైదులో పెడితే, ఆ రాజుకూతురు, ఆ రాకుమారుణ్ణి ప్రేమించి, అతణ్ణి ఖైదునుండి చాటుగా విముక్తుణ్ణి చేస్తుంది."

ఈ ఆశతోనే ఆరునెలలూ ఎదురు చూచేడు యువరాజు కాని ఒక్క అమ్మాయి కాదుకదా ఒక్క అబ్బాయేనా తన వేపు రాలేదు

ప్రభుత్వం ఆరునెలలూ అయినాక ఖైదునుండి విముక్తుణ్ణి చేసింది యువరాజుని.

ఈమాటు ఇతని బుద్ధి మునుల వేపు పోయింది "మునుల నడిగితే ఏదో త్రోవ చెపుతారు, అల్ల కొండలో గుప్తంగా మణివుందనో, లేక పాతాళంలో ఏదో శక్తివుందనో లేక మరేమేమో ... చెప్పక పోతారా" అని ధైర్యం చేసి మునులను అన్వేషిస్తూ బయలు దేరాడు యువరాజు.

చిట్టచివరకి మునిలాగే వున్నాడు ఎవరో బైరాగి. రాతి మీద కూర్చుని దేవుణ్ణి ప్రార్థిస్తున్నాడు. మనయువరాజుకి రత్నాల గని దొరికినట్లయింది త్వరగా ఆ బైరాగి వద్దకు పోయి, నమస్కారం చేస్తూ, "స్వామీ! స్వామీ!" అని పిలిచాడు.

కాని బైరాగి కళ్లు విప్పలేదు. ఆ తొందరలో తొందరగా కోపం కూడా వచ్చేసింది యువరాజుకి. పూర్వపు రాకుమారులైతే కోపంతో, చచ్చిన పాముని మునుల మెడలో పడేసేవాళ్లుట తనకక్కడ చచ్చిన పాము కాదుగదా బ్రతికినదైనా కనపడలేదు. ఈ విధంగా యువరాజు సందిగ్ధావస్థలోనుండగా ఆ బైరాగే కళ్లు విప్పి చిరునవ్వుతో ఆహ్వానించాడు. "ఎవరు నాయనా నువ్వు?" మృదువుగా అన్నాడు బైరాగి. యువరాజు తన చరిత్ర అంతా చెప్పి, ఏదేనా మార్గోపదేశం చేయండి స్వామీ!" అని బ్రతిమలాడేడు బైరాగిని.

అప్పుడు బైరాగి ఇలాఅన్నాడు "నాయనా! అజ్ఞానం, జ్ఞానం అనే రెండు పెద్దబాటలున్నాయి. 'అజ్ఞానం' అనే బాటలో తెలివితక్కువ, దుర్మార్గం, అవినీతి, అబద్ధం, దుర్గుణాలనే పిల్ల బాటలున్నాయి జ్ఞానం అనే బాటలో సన్మార్గం, నీతి, న్యాయం, ధర్మం, సౌశీల్యం అనే సుగుణాల బాటలున్నాయి నువ్వు అజ్ఞానం అనే బాటగుండా పోతున్న బాటసారివి. అనలా బాటలో మంచిని గురించి ఆలోచించే శక్తే వుండదు. ఈ కాశీ మజిలీ కథలు, అరేబియన్ నైట్స్, నిజంగా జరిగినవి కావు. స్వార్థపరులు కాలక్షేపంకోసం చేసిన కట్టుకథలు. వాటినిగురించి ఎక్కువ ఆలోచించకూడదు. వెళ్లు! ఇకనైనా అజ్ఞానం అనే బాటనుండి, జ్ఞానం అనే బాటమీదకు పోయి సుఖించు" అని మృదువుగా నవ్వి వీపు నిమిరాడు బైరాగి మన యువరాజుకి అజ్ఞానం అనే బుర్ర తీసేసి జ్ఞానం అనే బుర్ర తగిల్చినట్టయింది. వెంటనే దుఃఖంతోటీ సంతోషంతోటీ కల్తీఅయిన కన్నీళ్లను తుడుచుకొని, స్వామికి నమస్కరించి "సామీ! నన్ను అజ్ఞానం అనే బాటనుండి జ్ఞానం అనే బాటపై పడవేసిన మీకు ఇదే నా నమస్కారం" అని చెప్పి, మునివద్ద శెలవు తీసుకుని, జ్ఞానం అనే బాటగుండా పోతున్నాడు యువరాజు. కాదు... కాదు... "బాటసారి" ...





కోడిపిల్లలు

చిత్రకారిణి. నల్లాని పద్మావతి (8)

# ★ డబ్బుచెట్టు ★

జోషు డ్రాయరుమీద పెట్టటం చూశాను. ఆయన అన్నం తింటుండగా వెళ్ళి, ఒక అర్ధ రూపాయి తీసి, ఎవరూ చూడకుండా పాతి పెట్టేశాను. సాయంత్రం ఘనంగా ఈ విషయం మూర్తితో చెప్పాను. చాలా మంచిపని చేశావని వాడు నన్ను పొగిడాడు. ప్రతిరోజూ ఎవ్వరూ చూడకుండా ఆ పాతిన చోట నీళ్లు పోసేవాణ్ణి. ఒకరోజున పాతిపెట్టిన చోటు రామ్మూర్తికి చూపించాను. ఆ రాత్రి మా నాన్న పర్సులో అర్ధ రూపాయి పోయిందని గల్లంతు చేశారు. కాని నామీద ఎవ్వరికీ అనుమానం కలుగలేదు. ఇల్లా వారం రోజులు గడచినా ఏ మొక్కా మొలవలేదు.

ఒకరోజు కోపము వచ్చి పాతిపెట్టిన చోట త్రవ్వాను. అక్కడ ఏమీ లేదు, పాతిన అర్ధరూపాయీ లేదు. పాతిపెట్టిన చోటు వెతుక్కుంటూ కూర్చుంటే ఎవ్వరు చూస్తారోనని భయం వేసింది. పోతే పోయిందని వచ్చేశాను. కాని నాకు ఆశమాత్రం పోలేదు. దానికి తగ్గట్లు రామ్మూర్తి ఈసారి పెడితే మొలుస్తుందని చెప్తూవుండేవాడు. ఎన్నిసార్లు పాతిపెట్టినా, చెట్లు మొలవకపోగా పాతిపెట్టిన డబ్బులు కూడా కనపడకుండా పోయేవి. ఇంట్లో అంతకంతకీ నాన్నగారి కోపం (డబ్బులు పోతున్నాయని) ఎక్కువవుతూ వుంది. ఈవిధంగా రెండు, మూడు నెలలు గడిచాయి. ఇంతలోకే మాస్కూలుకి దసరా సెలవలు యిచ్చారు.

రేపు దసరా అనగా రామ్మూర్తి తన అమ్మా నాన్నల వద్దకు వెళ్లి, ఒక్క వారంరోజుల్లో తిరిగివస్తానన్నాడు. సరే నన్నారు మా నాన్న, మామయ్య లతా. రామ్మూర్తి నన్ను మా డాబా మీదకు తీసుకు వెళ్లి, తను వాళ్ల వూరు వెళ్తున్నానని, డబ్బు పాతి పెడితే చెట్లు మొలిచే మందు తెస్తాననీ, ఐదు రూపాయలు ఖర్చుపోతుందని, రాత్రికి మా నాన్నదగ్గర కొట్టేసి తెచ్చియిమ్మనీ అన్నాడు. నాకు గుండెలు గుభేల్‌మన్నై. కాని, "నువ్వింతవరకూ ఎన్నో డబ్బులు పాతిపెట్టావు, మీవాళ్లు నిన్ను ఏమన్నా అన్నారా! ఏం భయం లేదు. తప్పకుండా ఈ రాత్రికి నాకు డబ్బు తెచ్చి ఇయ్యి" అని చెప్పాడు. మరి 'మా నాన్నవాళ్లు తంతేనో?' అని అడిగాను. "జై వీరహనుమాన్ అంటే దెబ్బలు తగలవ"ని చెప్పాడు. సాయంత్రం చాలాసేపు ఆలోచించి, మానాన్నతో అన్నానికి రానని అమ్మతో తింటానని చెప్పి ఐదు రూపాయలు కొట్టేసి, రామ్మూర్తికిచ్చేశాను. రామ్మూర్తి 'భలేవాడివిరా' అని నాకొక బిళ్లలపొట్లం చేతికిచ్చాడు. దానిని తెచ్చి, మా నాన్నగారి పెట్టెలో అట్టడుగున పెట్టాను. మరునాడు ఉదయం ఆరు గంటలకే రామ్మూర్తి వాళ్ల వూరు వెళ్లిపోయాడు.

మా నాన్న స్నానంచేసి పర్షు తో దుక్కుంటూ 'అమ్మబాబోయి' అని కేక వేశారు. ఏమిటా అనిఅంతా చూస్తే, ఎర్రచీమలబారు! ఒంటి నిండా పర్షునిండా ఉన్నాయి. 'ఇవి ఎక్కడివి?' అని మా అమ్మని కేక లేశారు. 'ఏమో' అని బట్టలుఅన్నీ తీసేసరికి, నేను దాచిన బిళ్లలు కనిపించాయి. ఇవెక్కడివంటే, యివెక్కడివని అంతా కలిసి చివరకి నన్నడిగారు. రామ్మూర్తి తెచ్చియిస్తేదాంట్లో దాచానని చెప్పాను. మంచిపనిచేశావని మానాన్న కోపంగా అన్నారు. మా మామయ్యలు మానాన్న అవస్త చూసినవ్వడం మొదలెట్టారు. నాకూ నవ్వువచ్చింది కాని నవ్వితే ఎక్కడ కోప్పడతారోనని దిగమ్రింగాను.

ఇంతలోకే మాచిన్న మామయ్య వచ్చి వాళ్ల యింట్లో పట్టుబట్ట, గడియారం, పెన్ను పోయాయని చెప్పాడు. మా నాన్న వచ్చి పర్సులో ఐదురూపాయలు పోయాయని చెప్పారు. నాగుండెల్లో రాయి పడింది. "రోజూ పావలో అర్ధో పోతుంటే లెక్కల్లో పొరపాటొస్తోందనుకున్నాను, ఇవ్వాళ ఐదు రూపాయిలే పోయినై. ఎవరు తీస్తున్నారో తెలియటం లేదు. రాత్రి ఎవ్వరూ మనయింటికి రాలేదు" అంది మా అమ్మ. ఈ మాటలు వింటుంటే నాకు భయం వేసింది. వళ్లుఅంతా వణుకుతున్నది. నన్ను చూసి మాఅమ్మ నాదగ్గరకు వచ్చి, "ఏరా! నువ్వు తీశావా?" అంది. నాకు తెలియదన్నాను. "అట్లా వణికిపోతున్నాడు; వీడేగామాల్ను" అన్నాడు మానాన్న. నేను చెప్పే



"లేగదూడ"

చిత్రకారుడు : ఎ. వెంకట్రావు (14) ఖరగ్‌పూర్.

సమాధానాన్నిపట్టి నేనే తీశానని నిశ్చయించారు. మా అమ్మ ఒక కర్ర తెచ్చి వీపుమీద ఒకటి వేసింది. దెబ్బ బాగా తగిలింది. దాంతో రామ్మూర్తి చెప్పింది గుర్తొచ్చి, మా అమ్మ కొట్టినప్పుడల్లా "జై వీరహనుమాన్" అనడం మొదలెట్టాను. ఏమన్నా కూడా చచ్చేటట్లు దెబ్బలు తగిలినై. ఆరు దెబ్బలు ఎట్లాగో భరించాను. ఇంక దెబ్బలు భరించలేక ఉన్నది ఉన్నట్లు చెప్పేశాను. దాంతో పెన్ను, గడియారం, పట్టుబట్టలు కూడా రామ్మూర్తే కాజేశాడనుకున్నారు. ఇహానుంచీ యిట్లాంటి పనిచేస్తే దెబ్బలు తప్పవని కేక లేశారు.

నాల్గురోజులతరువాత రామ్మూర్తి కూరలూ అవీ తీసుకొచ్చాడు. అవి అక్కడ పెట్టమని, మామామయ్య, పలుపుతీసుకొని, 'పెన్ను, గడియారాలు తీసింది నువ్వేనా?' అని అడిగాడు. తియ్యలేదన్నాడు వాడు. "మా మేనల్లుడిదగ్గర ఐదు రూపాయలు తీసుకున్నావా, లేదా?" అన్నాడు మామయ్య. లేదన్నాడు వాడు. "నీ కివ్వలేదా?" అని నేనన్నాను. "నా కిచ్చావా? ఏమీ ఇవ్వలే" దన్నాడు. దాంతో నాకు ఏడుపొచ్చింది. ఇంక మా మామయ్య చేతిలోవున్న పలుపుతో రామ్మూర్తిని 2 గంటలసేపు బాదగా, చివరికి తనే తీశాననీ, నా దగ్గరనుంచీ ఐదు రూపాయలూ తీసుకున్నాననీ, పాతిపెట్టిన డబ్బు కూడా తనే తీశానని ఒప్పుకున్నాడు. దాంతో అతన్ని యింట్లోనుంచి వెళ్ళగొట్టేశారు మావాళ్లు. రూపాయిల చెట్టంతా అబద్ధమేనని తెలుసుకున్నాను. అప్పటినుంచి, ఒక్కకానీ దొంగతనం చేస్తే ఒట్టు. భయం కూడాను! అప్పటినుంచీ దసరాపండుగ వచ్చినప్పుడల్లా నాకు యిదంతా గుర్తొస్తుంది. ★



బహుమతి పొందిన చిత్రం,

**బృంద నృత్యం**

చిత్రకారుడు:

ఎస్. మల్లారెడ్డి (15) సిరికే,

గవర్న్మెంటు హైస్కూలు, ఉద్గీర్.

బొమ్మరిల్లు సీరియల్

అద్దెబోటులో-

# ముచ్చటగా ముగ్గురు

## (కుక్క సంగతి సరే సరి!)

'స్ట్రీట్లీ' లో మూడు రోజులు వున్నాం. అక్కడ వుండగా మా బట్టలు వుతికించుకోవడం జరిగింది మా బట్టలు మేమే వుతుక్కోవటానికి, జార్జి పర్యవేక్షణలో కొంత ప్రయత్నం చేశాం, కాని అదేమీ ఫలించ లేదు మా బట్టలు వుతకక పూర్వం చాలా మురికి పట్టి అసహ్యంగా వున్నమాట వాస్తవమే' అయినప్పటికీ తొడగడానికి వీలుగా నైనా వున్నాయి. అల్లాంటివి మేమీ థేమ్సు నదిలో పడేసి వుతికాక, ఆ చుట్టుపక్కల నదీ జలం చాలా మటుకు శుభ్రపడింది. 'రీడింగ్', 'హెన్లీ' గ్రామాల మధ్య, థేమ్సునది మామూలుగా చాలా మురికిగా వుంటుంది. ఆ మురికి అంతా మా బట్టలకి పట్టిపోయింది

ఇక చేసేది లేక, ఆ బట్టల్ని పట్టుకుపోయి ఒక చాకలిదానికి యిచ్చాం. అది మా దగ్గిర మామూలు రేటికి మూడింతలు వసూలు చేయటం మాట అటుంచి, తనకా పని చేస్తున్నంత సేపూ అదేదో బట్టలు వుతకటం మాత్రం కాదనీ, పురాతత్వపరిశోధన బాపతు పని ఏదో చేస్తున్నాననీ అనిపించిందని అన్నది.

అది అడిగినంత డబ్బూ మాట్లాడకుండా యిచ్చేసి యివతలకు వచ్చాం.

'స్ట్రీట్లీ' చుట్టుపట్ల చేపలుపట్టే పని జోరుగా సాగుతూ వుంటుంది. అక్కడ మంచి మంచి రకాల చేపలు దొరుకుతాయంటారు. పొద్దుటినుంచీ సాయంకాలం దాకా ఆగకుండా పట్టినా ఎన్ని చేపలైనా పడతాయంటారు. కొందరు అలా ప్రొద్దస్తమానమూ గాలం పట్టుకొని కూర్చుంటారుట కూడాను కూర్చోవటం వరకే కాని, ఎన్నడూ ఎవళ్ళకీ ఒక్క చేప అయినా పడదు. అసలా థేమ్సు నది పొడుగు పొడుగునా చచ్చిన ఎలుకలూ, పిల్లులూ తప్ప గాలానికి ఏమీ పడవు గాలానికి ఏదో ఒకటి పడుతున్నంత మాత్రం చేత, అది చేపలు పట్టడం ఎలా అవుతుంది ?

నాకు చేపలు పట్టటం అంత బాగా చేత కాదనుకోండి! ఇదివరకెప్పుడో ఒకసారి ఆ విద్య నేర్చుకోవాలని రెండు మూడు మాసాలు విపరీతంగా కష్టపడ్డాను. చేపలు పట్టటం నాకు బాగానే వచ్చిందనుకొనే సమయంలో, అందులో అనుభవం వున్న కొందరు పెద్దలు నా చుట్టూ చేరి, చేపలు పట్టే కళ నాకు యీ జన్మకు రాదనీ నన్ను దాని జోలికి పోవద్దనీ సలహా యిచ్చారు చేపలు పట్టేవాడికి వుండవలసిన బుద్ధి కుశలత ఏదో నాకు లేదు పొమ్మన్నారు.

కావాలంటే కవినైనా కాగలనేమో కాని చేపలు పట్టేకళలో ప్రవీణుడిని మాత్రం కాలేనన్నారు, మా

మూలం

జెరోమ్ కె. జెరోమ్



అనువాదం :

విశ్వాత్ముల నరసింహమూర్తి

పెద్దలు అంతా! ఈకళకి, కవిత్వం రాయటానికి కావలసినదానికంటే కూడా, చాలా ఎక్కువ భావనాశక్తి కావాలట!

చేపలు పట్టేవాడికి కావలసినదల్లా సునాయాసంగా, సిగ్గూ బిడియమూ విడిచి అబద్ధాలుఆడగల శక్తిమాత్రమే నని కొందరు అనుకొంటూ వుంటారు. కేవలమూ అబద్ధాలు చెప్పెయ్యగలగటం గొప్ప విద్యకాదు. ఆకళని కొత్తగానేర్చుకొన్నవాడు కూడా ఎంత పెద్ద అబద్ధాన్నైనా యిట్టే ఆడెయ్యగలడు. అలాకాక, ఆ అబద్ధాన్ని నిజమనిపించేలా చేయటానికి అవసరమైన కథనీ అతికిపోయే వాతావరణాన్ని సృష్టించి ప్రయోగించడం అనేది, ఎవరోఅతి అనుభవశాలులైన ఏ కొద్దిమందికో చేతనౌను.

ఎవరుబడితే వాళ్లు 'నిన్నగాక మొన్న నేనొక పెద్ద సొరచాపని పట్టాన'ని చెప్పెయ్యవచ్చు. అది తేలికే. అలా చెపితే అందులో కళ కాని, తెలివితేటలు కాని ఏమీ లేవు. ఆ కళలో ఆరితేరినవాళ్లు యిలాటి వన్నీ వచ్చి అబద్ధాలని యిట్టే పసిపట్టెయ్యగలరు. వాళ్లు అబద్ధాలు చెప్పే పద్ధతి వేరు.

అలాంటి కోవకి చెందిన పెద్దమనిషి మనయింటికి అతి మామూలుగా వచ్చినట్లు వస్తాడు. ముందుగా ఏమీ మాట్లాడకుండా ఓ కుర్చీలాక్కొని అందులో కూర్చుంటాడు, నోరువిప్పకుండా ఓ మూల కూర్చొని చుట్టపొగ గుప్పు గుప్పున వదులుతూ వుంటాడు. ముందు కాస్సేపు యితరులను యిష్టం వచ్చినట్లు వాగనిచ్చి, అప్పుడు వున్నట్లుండి ఒక్కసారిగా నోట్లోనుంచి చుట్టతీసి "అన్నట్లు,—మొన్న మంగళవారంనాడు చేపలుపట్టటానికి వెళ్లానోయ్." అని ఒక్క క్షణం వూరుకొని, "అయినా అదంతా చెప్పితేమాత్రం ఏం ప్రయోజనంలే!" అంటూ చప్పరిస్తాడు.

మీబోటివాడు "ఏం? ఏం జరిగింది ? ప్రయోజనం లేకపోవటమేమిటి ?" అని అడుగుతాడు.

"అవునయ్యా మరి; అదంతా చెప్పినా ఎవడూ నమ్మడు! అంచేత చెప్పి మాత్రం ప్రయోజనం ఏమిటి?" అని మిమ్మల్నే ఆ పెద్దమనిషి ప్రశ్న వేస్తూ, ఆరిపోయినచుట్ట వెలిగించుకొంటాడు.

ఆ తరువాత ఏం మాట్లాడాలో తెలియక మీరు మౌనంగావుంటారు. మీ నోట్లోనుంచి అసలే మాట పెగలటం లేదని గ్రహించి ఆయనే అందుకొంటాడు:

"అదికాదయ్యా: అలాంటివిషయం తీసుకొచ్చి



మునిమాపు వేళ

చిత్రకారుడు: ఎస్. రామప్రతాప్, (10) విశాఖపట్నం

# ★ ముచ్చటగా ముగ్గురు ★

ఎవరైనా చెప్పితే, నేనే నమ్మలేను. అయినప్పటికీ యథార్థంగా జరిగింది మరి. ఇక నమ్మకుండా వుండడం ఎవడి శక్యం! అసలు ఏంజరిగిందంటే—మొన్న మంగళవారంనాటిమధ్యాహ్నం గంటలతరబడి గాలంపట్టుకొని నదిఒడ్డున కూర్చున్నాను. ఎంతసేపటికీ చెప్పుకోదగ్గ పెద్దచేప ఏదీ గాలానికి తగుల్కోలేదు. ప్రాణం విసిగి లేద్దామని అనుకొంటూ వుండగా, వున్నట్లుండి గాలం బరువెక్కిపోయింది. ఈసారికూడా ఏదో మామూలు రకం చేపే పడివుంటుందనుకొని, గాలాన్ని బయటికి లాగబోయాను. ఊహు!... దాన్ని లాగటానికి నా బలం చాలేదంటే నమ్మి! గట్టిగా అరగంటసేపు...వూఁ! అరగంట! కాస్తాకూస్తా కాదు... తంటాలుపడి గాలం బయటికి లాగి, చూద్దునుకదా, కొక్కానికి చివర అంత 'పెద్ద' చేప వేలాడుతోంది. తూకం తూస్తే వీశెడు బరువు తూగుతుంది. అంత పెద్దచేప, వెధవది—మామూలు గాలానికి పట్టుపడిందంటే, సామాన్యమా మరి?" అంటాడు.

ఆకట్టుకథ అంతటితోనైనా ఆపకుండా, తను పట్టిన చేపనిచూసి ఎవరెవరు ఎంతగా ఆశ్చర్యపోయారో అదంతా అభినయ పూర్వకంగా వివరిస్తాడు.

ఇలాంటి కబుర్లు చెప్పే వాళ్లుఅంతా తరుచు హోటళ్లల్లో చేరుతూంటారు. 'ఇంత పచ్చి అబద్ధాలు ఎలా వినగలుగుతున్నారని నేను యిదివరకు ఒక హోటల్ యజమానిని చాటుకు పిలిచి అడిగాను. "ఏంచెయ్యమంటారండీ! హోటల్ పెట్టిన మొదటి రోజుల్లోమటుకు నాకూ మా ఆవిడకీ యీ కబుర్లు వింటుంటే మహా చిరాకుగా వుండేది. ఇప్పుడిప్పుడు మాకివి బాగా అలవాటైపోయాయిలెండి" అన్నాడు ఆ హోటల్ యజమాని.

నామిత్రుల్లో ఒకడు కొత్తగా, ఎగిరే చేపలు పట్టడం మొదలుపెట్టాడు. వాడికి అబద్ధాలు చెప్పటం యిష్టమూ లేదు: చేతనూ కాదు. అయినప్పటికీ యీ వృత్తిలో ప్రవేశించినందువల్ల దీని ధర్మాన్ని పాటించే వుద్దేశంతో, ఎప్పుడు ఏది జరిగినా దాన్ని యితరులకి చెప్పేటప్పుడు నూటికి నూరుపాళ్లు పెంచెయ్యకుండా, నూటికి ఇరవై ఐదు వంతులు మాత్రమే పెంచదలుచుకొన్నాడు.

"ఉదాహరణకి నేను ఒక్కరోజులో నలభై చేపల్ని పట్టుకొన్నాననుకో. ఇతరులతో చెప్పేటప్పుడు, ఆ నలభైలో నాలుగోవంతుయింకో పదికూడా చేర్చి, మొత్తం ఏభై పట్టానని చెప్తాను. అంతకంటే ఎక్కువగా అబద్ధాలు ఆడితే పాపం!" అన్నాడు వాడు, నాతో. ఈ 'ఇరవైఐదు పర్సెంటు ప్లాను' అను కొన్నట్లు పనిచెయ్యలేదు. ఎంచేతనంటే—ఏరోజునా వాడికి ముప్ఫైకంటే ఎక్కువ చేపలు దొరికేవి కావు. మాగాడికి ఇరవై ఐదు



"రిక్షావాలా"

చిత్రకారుడు: కొడవంటి మోహనరావు, (13) విజయనగరం.

పర్సెంటు కలపటం కుదరదు. —కనీసం చేపలవిష యంలో కుదరదు.

అదీకుదరకపోగా, 'ముప్ఫైమూడూ—ఒకటీ—బై—మూడు పర్సెంటు' కలిపి చెప్పదామనుకొన్నాడు. అదీ కుదరలేదు. రోజుకి ఒకటో రెండో చేపలు పట్టు పడ్డాయనుకోండి. వాటికి 'ముప్ఫైమూడూ—ఒకటీ—బై—మూడు పర్సెంటు' కలపడం ఎలాగ? ఈపీడ వదలేక యికనుంచీ రోజుకి ఎన్ని చేపలుపడితే అన్నిటిని రెట్టింపుచేసి చెప్పేద్దామనుకొన్నాడు.

ఈ ఏర్పాటు ఏదో రెండు నెలలపాటు విడవకుండా పట్టుకొచ్చాడు. ఆ రెండు నెలలూ గడిచేసరికి వాడికే ప్రాణం విసిగింది. అతిఆశకుపోకుండా రెట్టింపు చెయ్యటంతోమాత్రమే వీడు తృప్తిపడదామని చూసినందువల్ల, వీడిమాటలు విన్నవాళ్లు ఎవరూ నమ్మకపోగా, తోటివాళ్లల్లో వీడి పరువు పోయింది. ఉదాహరణకి వీడు ఒకరోజున నిజానికి మూడు చిన్నచేపలే పట్టాడనుకోండి. ఆరింటిని పట్టానని చెప్పేవాడు. వీడు మాత్రం ఆరు అని చెప్తావుంటే, వీడి కళ్లఎదుటనే ఒక్కటంటే ఒక్కటే పట్టిన చచ్చువెధవకూడా, యితరులతో చెప్పేటప్పుడు రెండు డజన్ల చేపలు పట్టానని చెప్పుకొనేవాడు.

ఇక యిల్లాకాదని—తనకి తానే ఒక ప్లాను వేసుకొన్నాడు. తన గాలానికిపడ్డ ప్రతిచేపని పదిపెట్టి హెచ్చవేసి, ఎన్ని చేపలు పడితే అన్ని పదుల చేపలు పట్టానని చెప్పుకోవటం మొదలుపెట్టాడు. ఒక్క చేప కూడా పడకపోయినప్పటికీ, పది చేపలు పడినట్లు ముందు లెక్కవేసుకొని, తరువాత ఎన్ని చేపలు పడితే, అన్ని పదులు యీ పదికి కలిపి చెప్పేవాడు. ఈ పద్ధతిప్రకారం అయితే, కనీసం చెప్పుకోవటంలోనైనా, చేపలుపడని రోజు అంటూ వుండదు. అదృష్టవశాత్తు ఒక్క చేప పడిందనుకోండి. ఏమీ పడనప్పటి పదీ; ఒక చేప పడింది కాబట్టి మరొక పది, మొత్తం యిరవై చేపలు పడ్డట్టు లెక్కకు వచ్చేవి. రెండు చేపలు పడ్డాయనుకోండి. మొత్తం ముప్ఫై అయ్యేది.





నృత్యనాటిక

చిత్రకారుడు: గురజాడ దుర్గాప్రసాదరావు (6) విజయనగరం.

ఈ ప్లాను బాగా పనిచేసింది. అంతమంచి ప్లాను కాబట్టే ఇటీవల వీడిలాటివాళ్లు ఎందరో యీ ప్లాను ప్రకారమే నడుచుకొంటున్నారని ఆమధ్యను నాతో ఎవరో లోపాయికారీగా చెప్పినట్లు జ్ఞాపకం.

మీకు ఎవరికైనా సానుకూలపడితే యీసారి యిటువేపు వచ్చినప్పుడు థేమ్సునది ఒడ్డునవున్న ఏ హోటల్‌కైనా వెళ్లి చూడండి. చేపలు పట్టే విద్యలో ఆరితేరినవాళ్లు ఒకరో యిద్దరో మీకు కనిపించితీరుతారు. వాళ్ల అనుభవాలనుగురించి వాళ్లు చెప్పే కట్టుకథలన్నీ వింటే, ఎంతలావు మనిషికైనా అజీర్ణవ్యాధి పట్టుకొని కనీసం రెండు నెలలైనా పీడించుకు తింటుంది.

(ఇంకావుంది)

# ★ నాట్యంచేసే పువ్వులు ★

"అయ్యయ్యో, నా పువ్వులన్నీ చచ్చిపోయాయి," అని విచారపడింది శశిలేఖ; "నిన్న సాయంత్రం ఎంత అందంగా వున్నాయో! ఇవ్వాళ పొద్దుటికి ఆకులు, రేకులు వడిలి వాడిపోయాయి. ఎందుచేతనో?" అని జామచెట్టుకింద కూర్చున్న తోటమాలి నడిగింది. తోటమాలి అంటే శశిలేఖకి చాలా ఇష్టం. తోటమాలి బలే హుషారైనవాడు; మంచి మంచి కథలు చెబుతాడు. అంద


మూలం:

హాన్స్ ఆండర్సన్

అనువాదం:

సామగానం సరస్వతీదేవి


మైన రాజులు, రాణులు, కోటలు, తోటలు, ఇవన్నీ బొమ్మలు వేసి పెడతాడు. "ఇవ్వాళ పువ్వులన్నీ వాడిపోయాతేం?" అని మళ్లీ అడిగింది.

"నీకింకా తెలియదా బుల్లెమ్మా! ఈ పువ్వులన్నీ క్రిందటి రాత్రి నాట్యం చెయ్యడానికి వెళ్లాయి. అందుకే బాగా అలిసిపోయి, ఇవ్వాళ మొహాలు వేళ్లాడేసుకుని కూర్చున్నాయి," అన్నాడు తోటమాలి.

"పువ్వు లెక్కడన్నా నాట్యం చేస్తాయేమిటి?" అని కళ్లు తిప్పుకుంటూ అడిగింది శశిలేఖ.

"ఎందుకు చెయ్యవూ? మనుషులే ననుకున్నావా, నాట్యం చేసేది?" అన్నాడు తోటమాలి; "చీకటి పడిన తరవాత, అందరూ నిద్రపోయాక, ఈ పువ్వులు కొమ్మల మీంచి, రెమ్మలమీంచి ఎగిరిపోతాయి. ప్రతిరోజూ నాట్యోత్స




"నాట్యరాణి"

కె. నారాయణరావు (15) చల్లకొండవారి వీధి, విశాఖపట్నము.

## నాట్యంచేసే పువ్వులు

వాలు జరుగుతూనే వుంటాయి.”

“ఆ చోటెక్కడో చెప్పవూ?”

“మన పట్టణం వెలుపల దూరంగా సరయు ఒడ్డున రాజుగారి కోట లేదూ? ఆ కోటలోపల చక్కటి పూలతోట వున్నదే? అక్కడ జరుగుతాయి ఈ నాట్యాలు.”

“మొన్న ఒకరోజున, నేను మా అమ్మతో కలిసి మన తోటలోకి వచ్చాను. అప్పుడు ఒక్క పువ్వు కూడా కనిపించలేదు. రోజూ బోలెడు పువ్వులు పూసేవి. ఏమయినాయో?”

“అవన్నీ రాజుగారి కోటకి వెళ్లి వుంటాయి” అన్నాడు తోటమాలి. “రాజుగారు, సామంత్రం దర్బారు పూర్తికాగానే మంత్రులతో వాళ్లతో కలిసి పట్టణంలో వున్న రాజభవనంలోకి వచ్చేస్తారు. అప్పుడు ఆ కోటంతా ఖాళీగా వుంటుంది. ఆసమయం కనిపెట్టి తోటలో వున్న పువ్వులన్నీ కలిసి కోటలోపలి కొలువు కూటంలోకి వెళతాయి. అప్పుడెంత బావుంటుందో చెప్పలేను. రెండు గులాబీ పువ్వులు సింహాసనం మీద కెక్కి కూర్చుంటాయి. అవి రాజూ, రాణీ అన్నమాట. ఎర్రటి బట్టలు తొడుక్కుని ఆకుపచ్చటోపీలు పెట్టుకున్న మందార పువ్వులు సింహాసనానికి అటూ ఇటూ బారులుతీర్చి నుంచుంటాయి. ఇవి రాజుగారికి అంగరక్షకులు. ఆతరవాత మిగతా పువ్వులన్నీ వంగి వంగి సమస్కారాలు చేసుకుంటూ లోపలికొస్తాయి. మల్లెలు, జాజులు, మాలతులు, చేమంతులు, జూకామల్లెలు, ఇంకా రకరకాల పువ్వులు ఏ జాతి కవి వేరు వేరుగా వలయాకారంగా నుంచుని, చేతులుపట్టుకుని నృత్యం చేస్తాయి.”



“తల్లి కౌగిట”

చిత్రకారుడు: అండ నరసింహమూర్తి (13) అనకాపల్లి.

“మరి రాజుగారి కోటలోకి అవి

వెడితే రాజభటులూరుకుంటారా?"

"ఎవ్వరూ చూడకుండా నిశ్శబ్దంగా లోపలికొస్తాయి. ఒక ముసలి బంట్రోతు మాత్రమే అక్కడ వుంటాడు. అప్పుడప్పుడు లోపలికొచ్చి అన్నీ భద్రంగా వున్నాయో లేదో చూసిపోతూంటాడు. కాని అతనిదగ్గిర పెద్దతాళం చెవుల గుత్తి వుంది. తాళం తియబోతుంటేనే గలగలచప్పుడవుతుందిగా? ఆచప్పుడు వినగానే పువ్వులన్నీ గబగబ తెరల చాటుకి పారిపోతాయి. మెడలు రిక్కించి తొంగి చూస్తూంటాయి. బంట్రోతు వెళ్ళి పోగానే మెల్లిగా వచ్చి మళ్ళీ యథాప్రకారం నాట్యం చేస్తాయి."

శశిలేఖ సంతోషం పట్టలేక చప్పట్లు కొట్టి గిర్రున తిరిగింది. "నేనుకూడా చూడవచ్చా ఆ నాట్యం?"

"ఓ. ఈసారి ఊరవతలకి షికారు వెళ్ళినప్పుడు చూద్దువుగాని. నేను నిన్న రాత్రి కిటికీలోంచి తొంగిచూశాను. ఓహో, ఎంత అద్భుతంగా వుందనుకున్నావ్?"

"మన ఊరిమధ్య పెద్ద ఉద్యానవనం ఉందే! అక్కడి పువ్వులుకూడా వెడతాయా?"

"ఎందుకు వెళ్ళకూడదూ? వెళ్ళవచ్చు. కాని నాకంత నిర్ధారణగా తెలియదు. అవి ఎప్పుడైనా వెళ్ళాయో లేదో? ఒక పని చేస్తావా నువ్వు? ఈసారి ఆ ఉద్యానవనానికి వెళ్ళినప్పుడు, ఎవరూ చూడకుండా ఒక పువ్వుతో చెప్పు, రాజుగారి కోటలో నాట్యోత్సవాలు జరుగుతాయని. ఆ పువ్వు ఇంకో పువ్వుతోను, అది ఇంకోదానితోను, చెబుతాయి. ఇట్లా అన్ని పువ్వులకీ తెలిసిపోతుందా సంగతి. వెంటనే వీలుచూసుకుని అవన్నీ కోట కెగిరి వెళ్ళిపోతాయి. ఒక్క పువ్వుకూడా మిగలదు. అప్పుడు అక్కడి తోటమాలి వచ్చిచూసుకుని ఈ పువ్వులేమై పోయినాయా అని తెల్లబోతాడు."

"పువ్వులికి మాట్లాడుకోవడం కూడా వచ్చా?"

"మాటలురావుగాని, ఒకదాని కొకటి సంజ్ఞలు చేసుకుంటాయి. అప్పుడప్పుడు గాలి వీచినప్పుడు పువ్వులు తలకాయలూపుతూంటాయే; అదేమిటనుకున్నావ్? పువ్వులు చేసుకునే సంజ్ఞలే అవి."



"సర్పనృత్యం"

చిత్రకారుడు : ఎ. వెంకట్రావు (14) ఖరగ్‌పూర్

"ఈ సంజ్ఞలు నీకు అర్థం అవుతాయా?"

"ఆ, తోటమాలు లందరికీ అర్థమవుతాయి. ఒకరోజున పట్టణ ఉద్యానవనంలోని తోటమాలి వచ్చేటప్పటికి మొగలిపువ్వు కనకాంబరం పువ్వుతో మాట్లాడుతోంది: 'కనకాంబరం! నువ్వెంత అందంగా వున్నావో! మనిద్దరం పెళ్ళి చేసుకుందామా?' అంటోంది. ఇదిచూసి ఆ తోటమాలి 'ఏమిటా పిచ్చికూతలు, నోరుముయ్,' అని మొగలిపువ్వును గదిమాడు. మొగలిపువ్వు కోపం తెచ్చుకుని తన ముల్లుతో పొడిచింది. అప్పట్నించీ ఆతోటమాలి మొగలి చెట్టుదగ్గిరి కెప్పుడూ వెళ్ళడు."

"బలేగా వుందే!" అని కేరింతలు కొట్టింది శశిలేఖ.

ఇంతలోకే శశిలేఖ అన్నగారు అటు వచ్చి ఈ మాటలు విన్నాడు. "ఏయ్, తోటమాలీ! నీకేం పనీ పాటా లేదూ? వెర్రిమొర్రి కబుర్లు చెప్పి పిల్లని చెడగొడుతున్నావా?" అని కసిరాడు. అతనికి తోటమాలి అంటే మహా చిరాకు. అతడు కలిపించే కథలు, గీసే బొమ్మలు చూసి కనుబొమలు చిట్లించి కోపం చూపిస్తాడు."

కాని అమాయకపు పిల్ల శశిలేఖకి వాళ్ళ తోటమాలి చెప్పినదంతా వేదప్రమాణంగా తోచింది. ఎంత ఆలోచించినా పువ్వులు నాట్యం చెయ్యడంలోవున్న అసహజత్వం ఏమిటో ఆమెకు తెలియలేదు. నిజంగానే పువ్వులన్నీ తలలు వాల్చుకుని నీరసంగా వున్నాయి. మరి రాత్రంతా నాట్యం చేస్తే నీరసంగా వుండదూ? శశిలేఖ చప్పున ఆ పువ్వు లన్నిటినీ కోసి, బుట్టలో వేసి, ఇంట్లోకి తీసికెళ్ళింది. తను పడుకునే గదిలో బోలెడు అందమైన ఆటవస్తువులున్నాయి. తనకి అన్నిటిలోకి యిష్టమైన "అమ్మణ్ణి" అనే బొమ్మ బుల్లి మంచంమీద పడుకొని గుర్రుకొడుతూ నిద్రపోతోంది శశిలేఖ ఆ బొమ్మని లేపింది: "అమ్మణ్ణీ! లే. ఇవ్వాళ్టికి నువ్వు నా బట్టల పెట్టెలో పడుకో. నీ మంచంమీద ఈ పువ్వుల్ని పడుకోబెడతాను. వీటికి పాపం జ్వరం వచ్చిందట. ఏం," అంటూ అమ్మణ్ణిని తీసి తన పెట్టెలో పెట్టింది. పువ్వుల్ని మంచం మీద అమర్చి చుట్టూ దోమతెర వేసింది. పాపం, అమ్మణ్ణికి కోపం వచ్చింది, గాని కిక్కురుమన లేదు.

శశిలేఖ బుల్లిమంచంమీద పువ్వుల్ని పడుకోబెట్టింది. దోమతెరలు కిందకి



"గింజలకోసం"

చిత్రకారుడు: వెల్లపూడి తమ్మన్న (12) పార్వతీపురం.

# ★ నాట్యంచేసే పువ్వులు ★

దింపింది. అల్లరి చెయ్యకుండా పడుకో మని పువ్వులతో చెప్పింది. పడుకుంటే జ్వరం తగ్గిపోయి, తెల్లారేటప్పటికీ మళ్లీ కలకలలాడుతూ ఉండవచ్చని చెప్పింది.

ఆ సాయంత్రమంతా ఆమెకి తోటమాలి చెప్పిన మాటలే గుర్తొచ్చాయి. రాత్రి తను పడుకోబోయే ముందు మళ్లీ ఒకసారి తోటలోకి తొంగిచూసింది. మల్లెలు, మందారాలు అన్నీ గప్‌చిప్‌గా కూర్చొని ఆమెకేసి చూశాయి. "నాకు తెలుసు; ఇవ్వాళ నాట్యానికి వెడదామనుకుంటున్నారు." అని ఆమె రహస్యంగా అన్నది. కాని పువ్వులు ఏమీ ఎరగనట్టు, తమకి ఆమె అన్నది అర్థంకానట్టు ఊరుకున్నాయి. ఎక్కడా ఒక్క ఆకైనా కదలలేదు.

శశిలేఖకి ఆరాత్రి చాలసేపు నిద్రపట్టలేదు. రాజుగారి కొలువుకూటంలో పువ్వులు చేసే నాట్యంచూస్తే ఎంత బావుంటుందో నని తీయటి ఆలోచనలు వచ్చాయి. "ఈపాటికి మా తోటలో వున్న పువ్వులన్నీ కోటకి పోయివుంటాయి," అనుకున్నది. అనుకుంటూనే నిద్రపోయింది. ఒక రాత్రివేళ మెలకువ వొచ్చింది. అప్పటిదాకా తోటమాలి తనకు పువ్వుల్ని గూర్చి చెప్పడం, అన్నగారువచ్చి కేకలెయ్యడం కలగన్నది. లేచేసరికి గది అంతా నిశ్శబ్దంగా ఉన్నది. దీపం వెలుగుతూనే వుంది. అమ్మ, నాన్నా నిద్రపోతున్నారు.

"ఆ పువ్వులు నేను పడుకోబెట్టిన చోట ఉన్నాయో లేవో?" అనుకుంది. కొద్దిగా లేచి చూసింది. తన ఆటవస్తువులున్న గది తలుపు కొద్దిగా తెరిచివుంది. చెవి ఒగ్గి విన్నది. వీణ, మద్దెలవాయిస్తున్న ధ్వని వినబడింది. అంత మంచి సంగీతం ఆమె ఎప్పుడూ వినలేదు. "ఓహో, పువ్వులన్నీ నాట్యం చేస్తున్నట్టున్నాయే; వెళ్ళి చూడనా?" అనుకుంది. కాని లేస్తే, అమ్మ నాన్నా మేలుకుంటారేమో నని భయపడింది. మళ్ళీ రెండు నిమిషాలు పడుకుంటుంది. సంగీతం అంతకంతకూ తేనెల వాకలాగ వెల్లివిరుస్తోంది. ఇక ఆగలేక పోయింది. మెల్లిగా లేచింది; పరికిణీ ఎత్తి పట్టుకుని అడుగులో అడుగు వేసుకుంటూ తన గదివద్దకు వెళ్ళి తొంగిచూసింది.

ఎంత అందమైన దృశ్యం! ఆ గదిలో ఎక్కడా దీపం లేదు. కాని మెత్తటి కాంతి ఏదో అంతటా నిండివుంది. బహుశా కిటికీలోంచి వచ్చే వెన్నెల వెలుగే అయి వుంటుంది. మందార పువ్వులు బారులుతీర్చి నుంచున్నాయి. తోటలోని పువ్వులన్నీ గదిలోకి వలయాకారంగానుంచుని నృత్యం చేస్తున్నాయి. పచ్చ గన్నేరు పువ్వొకటి వీణ వాయిస్తోంది. దాన్ని చూస్తే శశిలేఖకి తన స్నేహితురాలు మృణాళిని జ్ఞాపకం వచ్చింది. మృణాళిని అచ్చు పచ్చ గన్నేరు పువ్వులాగ వుంటుందని తోటమాలి అనేవాడు. అప్పుడు తనకి నవ్వొచ్చేది. కాని ఇప్పుడు చూస్తే ఈ పచ్చగన్నేరు పువ్వు సరిగ్గా మృణాళిని మోస్తరుగానే కూర్చుని, ఆమె లాగానే వీణ వాయిస్తోంది.

ఇంతలో ఒక ఎర్రగన్నేరుపువ్వు ఆట వస్తువులున్న బల్లమీది కెగిరింది. పక్కనే వున్న బుల్లిమంచపు దోమతెరలు వొత్తిగించింది. జ్వరంతో పడుకున్న పువ్వులింకా పడుకునే వున్నాయి. ఎర్రగన్నేరును చూడగానే అవి లేచి కూర్చున్నాయి. "నాట్యం చేస్తారా?" అని ఎర్రగన్నేరు సైగచేసింది. అవి అల్లాగేనని తలలూపి మంచంమీంచి దూకాయి. వాటికి జ్వరం కాస్తా ఎగిరి చక్కా పోయినట్టుంది. ఉత్సాహంతో కళకళలాడుతూ నృత్యం చేయసాగాయి. వాటిలో ఒక్కటికూడా శశిలేఖ తమ్మ చూస్తోందని గుర్తించినట్టు లేదు.

ఇంతలో బల్లమీంచి ఏదో కిందపడిన శబ్దమైంది. అది శశిలేఖ బొమ్మల్లో ఎర్ర తలపాగా చుట్టుకున్న బొమ్మ. అదేం చిత్రమో గాని, ఆ క్షణంలో ఆ బొమ్మ సరిగ్గా శశిలేఖ అన్నగారిలాగ కనిపించింది. ఆ బొమ్మ నాట్యంచేస్తున్న పువ్వుల్తో ఏదో మాట్లాడ్డానికని దగ్గరగా వెళ్ళి వాళ్ళచుట్టూ తిరిగింది. కాని నృత్యపు సందడిలో ఏ పువ్వూ ఈ బొమ్మకేసి చూడనైనా లేదు. ఆ బొమ్మకి కోపం వచ్చింది. తన్ను అందరూ చూడాలని చెప్పి, ఊరికే పొడుగు పెరిగిపోసాగింది. అప్పుడు పువ్వులన్నిటిని ఆగమని కేకవేసి "ఈ పిచ్చి పిచ్చి వేషాలువేసి చిన్న పిల్లని చెడగొడుతున్నారా?" అని సరిగ్గా తన అన్నగారి లాగానే కోప్పడింది. కాని వెంటనే బార్లు తీర్చినుంచున్న మందారపువ్వులు ఆ బొమ్మ కాళ్లమీద ఫెడీమని తన్నాయి. అప్పుడు బొమ్మ మళ్లీ యథాప్రమాణానికి కుదించుకు పోయింది. ఇది చూస్తుంటే శశిలేఖకి బలే

నవ్వొచ్చింది. ఇక లాభంలేదనుకుని ఆ బొమ్మ తనుకూడా పువ్వులతో కలిసి నాట్యం చెయ్యసాగింది.

ఇంతలో శశిలేఖ బట్టల పెట్టెలోపలి నించి ఎవరో తట్టుతున్న సవ్వడి వినిపించింది. అప్పుడు ఇందాకటి ఎర్ర తలపాగా బొమ్మ గబగబా వెళ్ళి కష్టపడి పెట్టె మూత తీసింది. అందులోంచి అమ్మణ్ణి అనే బొమ్మ బయటికి వచ్చింది. పువ్వుల్ని చూసి "ఇవాళ ఇక్కడ నాట్యం జరుగుతుందని నాతో ఎవ్వరూ చెప్పలేదు. ఒక్క ముక్క చెబితే అరిగిపోతారు కాబోలు. హుఁ. అవున్లే. నే నెందుకు జ్ఞాపకం ఉంటానూ!" అని మూతి బిగించుకుంది అమ్మణ్ణి.

ఎర్ర తలపాగా బొమ్మ, "నాతో నాట్యం చేస్తావా?" అని అడిగింది.

"మరే, మహా గొప్పవాడివి వొచ్చావని, నీతో నాట్యం చేస్తా!" అని మూతి తిప్పుకుంటూ ఒక మూల నుంచుంది. పాపం, ఏ జాకామల్లెపువ్వో, గన్నేరు పువ్వో, చేమంతిపువ్వో తన్ను పిలిచి తనతో నాట్యం చేస్తుందని ఆశపడింది. కాని ఎవ్వరూ అమ్మణ్ణిని పిలవలేదు. తను ఉన్నట్టు వాళ్ళకి తెలియదేమోనని గట్టిగా దగ్గింది. అయినా ఎవ్వరూ ఆమెని చూడలేదు. ఎర్రతలపాగా బొమ్మ తనొక్కత్తే నృత్యం చేస్తోంది. ఇక ఇది పనికాదనుకుని అమ్మణ్ణి కాలుజారి పడినట్టుపడి "అమ్మో" అని కేక వేసింది. అప్పుడు పువ్వులన్నీ అమ్మణ్ణిని చూశాయి. దగ్గిరికివచ్చి "ఏమమ్మ, దెబ్బతగిలిందా?" అని ఆప్యాయంగా అడిగాయి. ముఖ్యంగా అమ్మణ్ణిని మంచంమీద పడుకున్న పువ్వులు చాలా సముదాయించాయి. దెబ్బ తగల్లేదని అమ్మణ్ణి సమాధానం చెప్పింది. తరవాత అవి అమ్మణ్ణిని గది మధ్యకి తీసుకువెళ్లాయి. చంద్రుడి కాంతి గదికప్పులోని కిటికీగుండా నేలమీద గుండ్రంగా పడుతున్నది. ఆ కాంతి వలయంలో అమ్మణ్ణితో కలిసి పువ్వులునాట్యం చేశాయి. మిగతా పువ్వులన్నీ వాటికిచుట్టూ వలయాలు వలయాలుగా ఏర్పడి కృష్ణుడు గోపికలతో రాసక్రీడ చేసినట్టు నాట్యం చేశాయి. అమ్మణ్ణి పొంగిపోయింది. తన మంచాన్ని అచ్చగా వాడుకోవచ్చుని పువ్వులికి చెప్పింది. కాని పువ్వు లిలా అన్నాయి:

"మే మెక్కువకాలం బ్రతకం. రేపు పొద్దుటికల్లా చచ్చిపోతాము. నువ్వు శశిలేఖతో చెప్పు, మమ్మల్ని తోటలో జామ చెట్టుకింద గొయ్యి తీసి పాతిపెట్టమని. అప్పుడు మళ్ళీ వచ్చే వసంత ఋతువు నాటికి మేలుకుని, ఇప్పటికన్నా అందంగా వికసిస్తాం."

ఇంతలో గది తలుపు బాగా తెరుచుకుంది. బోలెడు పువ్వులు నాట్యంచేస్తూ లోపలి కొచ్చాయి. ఇన్ని పువ్వు లెక్కణ్ణించి వొచ్చాయో శశిలేఖకి తెలియలేదు. బహుశా రాజుగారి తోటనించి వొచ్చాయనుకుంది. ముందు రెండు గులాబీ పూలు వొచ్చాయి. అవి రాజూ, రాణీ అన్నమాట. తామర పువ్వులు, కలవ పువ్వులు మృదంగాలు వాయించుకుంటూవచ్చాయి. పువ్వులు తూతూ బాకా లూదుకుంటూ వొచ్చాయి. ఇంకా పారిజాతాలు, రాధామాధవ పువ్వులు, కనకాంబరాలు, నీలాంబరాలు, మొగలిపువ్వులు, జాజులు, సన్నజాజులు, శేఫాలికలు, శిరీషాలు, బొగడలు, సంపెంగలు, బొండుమల్లెలు, మాలతులు ఇంకా ఎన్నో రకాల పూలు గిరగిర తిరుగుతూ వచ్చాయి. అన్ని పువ్వుల్ని ఒక్కసారి, ఒక్కచోట చూసేసరికి శశిలేఖ హృదయం కూడా నృత్యం చెయ్యసాగింది.

చివరకి అలసిపోయి, పువ్వులు ఒకదాని వద్ద ఒకటి సెలవు తీసుకొని వచ్చినదారినే నిష్క్రమించాయి. తరవాత శశిలేఖ వెనక్కివచ్చి తన పక్కమీద పడుకున్నది. మళ్ళీ జరిగినదంతా కలలో కనిపించింది. తెల్లవారిన తరవాత, బుల్లి మంచంమీద పువ్వు లున్నాయో లేవో చూట్టానికి వెళ్ళింది. దోమతెరలు వొత్తిగించి చూసింది. పువ్వులన్నీ అక్కడే వున్నాయి; కాని బాగా వాడి వత్తైపోయాయి. పెట్టె తెరిచి చూసింది. అమ్మణ్ణి అక్కడే వుంది. దానికి నిద్రతో కళ్ళు మూసుకుపోతున్నాయి.

"అమ్మణ్ణీ! పువ్వులు నాతో చెప్పమన్న మాటలు జ్ఞాపకం వున్నయా?" అని శశిలేఖ అడిగింది. అమ్మణ్ణి ఏమీ మాట్లాడలేదు.

శశిలేఖ ఒక చిన్న కాగితం పెట్టె తీసుకుంది. దాంట్లో వాడిన పువ్వులన్నిటినీ పేర్చింది.

"మిమ్మల్ని పాతిపెట్టేదాకా మీ రిందులోనే వుండండి. మా మేనత్తగారబ్బాయిలు విజయవర్మ, అజయవర్మ వచ్చాక వారిచేత గొయ్యి తవ్విస్తాను," అన్నది శశిలేఖ.

దసరాపండక్కి విజయవర్మ, అజయవర్మ మేనమామగారింటికి వచ్చారు. వాళ్ల నాన్న వాళ్లకి చెరొక విల్లంబూ కొని పెట్టాడు. వాళ్లు గర్వంగా వాటిని శశిలేఖకి చూపించారు. శశిలేఖ వాళ్ళతో చచ్చిపోయిన పువ్వుల్ని గురించి చెప్పింది. వాళ్లుకూడా ఎంతో విచారపడ్డారు. తోటలోకి వెళ్లి ఎవరూ చూడకుండా జామచెట్టుకింద గొయ్యి తవ్వారు. శశిలేఖ పువ్వుల్ని ముద్దుపెట్టుకుని గోతిలో వుంచింది. విజయవర్మ, అజయవర్మ పైన మట్టి కప్పేశారు. మృతకుసుమాలపట్ల గౌరవసూచకంగా విల్లెక్కుపెట్టి బాణాల్లో కుంకుమ కూరి ఆకాశంలోకి వదిలారు. ఆ ప్రదేశమంతా కుంకుమ ధూళితో ఎర్రపడిపోయింది.



పంచతంత్రం

# సంధి-విగ్రహం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి





(మంత్రి సగర్వగర్వంగా)
"మనము కూడ ఈ శశకములవలె
పలువురుచే మోసపోదుమని
నా కనుమానము కలుగుచున్నయది;
తమ సెలవైన నా ఆలసింపకయె
వీని నిక్కడనే నాశ మునర్చెదము!"



"అవును, నిజం ఓ మంత్రీ! - నీవన్నది నిజం
నిజం!! - అయినా నాదొక మాట —
ఆగంతుకుడితడు మన-కేదైనా
అపకారం - తలపెట్టే వరకైనా -
అనుమానం తగదోయీ! - స్థలచర
ములలో సమరం - ఆసన్నం
అయినదిప్పుడు ....





పంచవట ప్రాంతంలో
ఉండే దొక వటవృక్షం



ఆ వృక్షం తొఱ్ఱలోన
రోమశుడను బిడాలం
కలకాలం కాపురముండెను.



పలితుండను ఎలుక కూడ
చెట్టుకింద కలుగులోన
చిరకాలం నివసించెను.



ఇట్లుండగ ఒకరాత్రి - కిరాతుడటకేతెంచి -
చెట్టు చుట్టు వురులు పన్ని - సడిసేయక
వెడలి పోయె.



వేకువనే నిదుర లేచి
ఆహారాన్వేషణాకై
చెట్టు దిగిన రోమశుడూ
ఉరులలోనే తగుల్కొనియె!"



ఇది అంతా పరికించిన - పలితుడు
సంతోషంలో - పీడ తొలగిపోయినదని
- కలుగు విడిచి వెలికి వచ్చి -
యధేచ్ఛగ విహరించెను



కలుగు విడిచి వెలికి వచ్చి - ఒడలు మరిచి ఆడుచున్న -
పలితుని భుజియించుటకై - గగన వీధి నెగురుచున్న -
చంద్రకుడను ఉలూకమ్ము - నేలమీద వాలింది.



(పలితుడు తనలో) "హా! హతోస్మి! ఏమి చేయుదు? -
అటుపోయిన మార్జాలం - ఇటు చూచిన ఉలూకం! -
ఎటులయినా మృత్యువు తప్పదు - ముప్పు తప్పు
నుపాయం చక్కగ యోచించవలెను!"





పంచతంత్రం

# సంధి-విగ్రహం

కర్త...విశ్వాత్ముల నరసింహమూర్తి



అని యనుకొను
నంతలోనె -
ఉపాయ మొకటి
మనసులోన -
మెరుపల్లె
మెరిసింది.

"ఓ బిడాలమా! నమస్కారం - ఇన్నినాళ్లుగా మనమిరువురము - ఇరుగు పొరుగుననే నివసించితిమి. - నీకు కలిగినా ఆపద చూచి - కలుగు విడిచినే వెలికి వచ్చితిని - పుణ్యానికి పోతే పాపం! - ఈ ఉలూకమొకటి దాపురించినది. - ఉరులు కొరికి నిను విముక్తు చేసెద; - ఘూకము పొల్పడకుండా - నీవే నను రక్షింపుము!"



"ఆడబోయిన తీర్థమే నాకెదురైనది - నీ సహాయమర్థించాలని - నేనూ యోచిస్తున్నా - ఆపద్బాంధవుడవై నీవే యిలు వచ్చావు నీకెవరి వలననూ హాని కలుగదు - దిగులు చెందకో మూషికమా! - మది భయము వీడుమో పలితుండా!!"



(ఇంతలోన) ఉరులు పన్నిన కిరాతుడును జాగిలములను వెంట నిడుకొని వేవేగముగా వచ్చుచుండెను.



"మాటలలోపడి మరచిపోయితిమి; యమకింకరుడదె వచ్చుచుండెను; నీట ముంచినను పాల ముంచినను నీవే దిక్కని నమ్మితిని!"



కిరాతుండునూ, జాగిలములునూ సమీపానికి వచ్చే వరకూ బిడాలమున్న వలను పలితుడు కొరుకు నటుల నటియించుచుండెను.



కిరాతుడు వచ్చుటచేతను అడుగుల సవ్వడి వినిన ఉలూకము ఎగిరిపోయి వృక్షమ్మున వ్రాలెను.



ఉలూకమూ ఎగిరిపోవగా నిర్భయముగ నామూషికము వలతాళ్లన్నిటి కొరికివేసెను; వడివడిగా తన కలుగు జేరెను. మార్జాలమునూ పారిపోయెను.



వలను పడిన ఆ బిడాలము చేజిక్కినటు చిక్కి జారిపోయెనని కడు విషాదముతో ఆ నిషాదుడు నిశ్చేష్టుండై నిలచిపోయెను.



నిషాదుడు
నిట్టూర్పు వ్మ-
ఆచ్చోటు వీడి
చనిన. వెనుక-
మార్జాలము
తిరిగివచ్చి-
పలితుని
కలుగు చేరి....

"సకల జీవులు ఛీరా యన నాపై దయ జూపితివి. తక్షణమే నిను చూడవలెనని తహతహ చెందుతు వేచియుంటిని ఆలసింపకయె వెలికి రమ్మిక!"



(పలితుడు. కలుగులోనుంచి)
"శత్రువుతో సఖ్యం చేసినా - బుద్ధిమంతుడూ ఏమరియుండడు. - వలలో పడి నీవును - కడు బడలియుంటివి నేనిప్పుడు వెలికి వచ్చినా - నను భుజియించి తృప్తి చెందెదవు. - కావున నేనిక నీకగపడను; వచ్చిన దారినె వెడలిపొమ్మిక!"



పేరాశకుపోయిన రోమశుడూ - ఖిన్నవదనుడై వెడలిపోయెను.



# మానుపులి

పిట్టలు కీచుమంటున్నాయి.

ఉదయపు చలిగాలికి కళ్లు తెరవడానికే బద్ధకంగా వుంది. మా యింటి వాతావరణంలో మా తాతయ్య మాటలు వినబడుతున్నాయి. చప్పున కళ్లు తెరిచి చూచాను. తాతయ్య యెదురుగా కుర్చీలో కూర్చొని వున్నాడు. దగ్గిరగా అమ్మ నిలబడి కుశలప్రశ్నలు వేస్తూవుంది. నేనొక్క గంతులో తాతయ్యఒళ్లో వాలాను. తాతయ్య నన్ను ఒక్కసారి గట్టిగా అదుముకొని తన చేతిసంచిలోంచి కొన్ని పళ్లను నాకు యిచ్చాడు. సంతోషంలో కుప్పిగంతులు వేస్తూ యిల్లంతా పరుగెత్తాను. తాతయ్య అప్పుడే తెల్లవారఝామున వచ్చే ఎక్స్‌ప్రెసుకు వచ్చాడని చెప్పింది అమ్మ. దసరాపండగకు తనను, మమ్మల్ని పుట్టింటికి తీసుకెళ్లడానికి తాతయ్య వచ్చినట్టుగూడా చెప్పింది అమ్మ.

తాతయ్య యిచ్చిన పళ్లను ఒక్కక్షణంలో స్వాహా చేతామని అరనిమిషంలో ముఖాన్ని కడిగి నట్టుచేసిఒక్కొక్క పండుతొక్కలు

**ధరణికోట**
**సవితార కుమార్ (13)**
నల్లగొండ.

తీయడానికి ఉపక్రమించాను. తాతయ్యగూడా ముఖం కడిగేసి అక్కడే వచ్చి కూర్చొని అమ్మ అందించిన వేడి కాఫీ పుచ్చుకుంటున్నాడు. తాతయ్య మొదటి నుండి లావాటి మనిషి. ఈమధ్య మరింత లావెక్కింది ఆయనశరీరం.

'తాతయ్యా! మన ప్రయాణం ఎప్పుడూ?' అడిగాను తాతయ్యని.

'యెల్లుండి ఉదయంబండికి వెళ్లుదాం నాన్నా' అన్నాడు తాతయ్య. ఇంకేముంది. వెంటనే గదిలోకి వెళ్లి నా పెట్టెలో వుతికిన బట్టలు యెన్ని వున్నాయని చూసుకున్నాను. రెండు పంట్లాములు. మొదలు ఇవి యేరంగు గల బట్టలో చెప్పడం కష్టం. తోళ్లలాగున్నాయి. వెధవ పంట్లాంలు. విసుగేస్తుంది. రెండేళ్లయినా యింకా చిరగడంలేదు. ......వెలవెలపోతూవున్న రెండు హాఫ్ షర్టులు అసహ్యంగా వున్నాయి. రెండుసార్లు కుట్టింది అమ్మచంకక్రింద చిరిగితే. యెలాగు తొడుక్కు వెళ్లేది ఈ బట్టల్ని తాతయ్యవూరికి. అయినా జ్ఞాపకం వచ్చింది. దసరాపండగకి నాన్నారు ఓపంట్లాము ఓషర్టు కుట్టించేరు. తాతయ్య తీసుకెళ్లితే ఆయనగూడా బట్టలు కుట్టించేస్తాడు పండగకి, అనుకున్నాను. అనుకోవడమేమిటి అడిగేశానుకూడా తాతయ్యని 'నాకు బట్టలు కుట్టిస్తారా' అని.

'ఓ. భలేబట్టలు కుట్టిస్తానులే" అన్నాడు తాతయ్య.

అమ్మ కళ్లెఱ్ఱచేసి నన్ను ఉరిమి చూసింది. ముక్కుమీద వేలు పెట్టుకుంది. అలాగ తాతయ్యను అడగడం తప్పు అన్నట్టుగా.

నేను ధోరణి మార్చేశాను. "తాతయ్యా! మీవూళ్లో మాను పులులున్నాయా" అన్నాను.

"అలాంటివి యేమీ లేవులే" అన్నాడు తాతయ్య.

"ఈవూళ్లో మానుపులి రాత్రిళ్లు తిరుగుతూవుంది తాతయ్యా. చిన్న పిల్లల్ని యెత్తుకుపోతుందట. మేము రాత్రిళ్లు భయంగా వుంటున్నాం" అని, చెప్పాను తాతయ్యకి.

అదేం సంగతి అన్నట్టుగా తాతయ్య అమ్మ మొహం చూశాడు. అమ్మగూడా చెప్పేసింది తాతయ్యకి, మానుపులి నిజంగానే వూళ్లో తిరుగుతోందని, అందరు భయపడుతూ వున్నారని.

చూస్తూండగానే రాత్రి అయింది. అందరం భోజనాలు చేశాం. తాతయ్య వచ్చాడనో యేమో అమ్మ రోజుకంటె కమ్మగా కూరగాయలు వండేసింది. పడుకునే సమయం వచ్చింది. కింద దోమల బాధ బాగావుందని తాతయ్యకు డాబామీద పంచలో మంచం వేశారు. తాతయ్యవద్ద నన్ను గూడా పడుకొమ్మన్నారు. కాని నేను భయపడ్డాను. మానుపులి డాబాలపైకి గూడా యెక్కి పిల్లల్ని యెత్తుకుపోతుందని చెప్పగావిన్నాను. తప్పించుకొని నేను కిందనే నాన్నారి వద్ద పడుకున్నాను. యెల్లుండి ప్రయాణంకదూ, ఆ సంబరంలో నాకు చాలా రాత్రివరకు నిద్రపట్ట లేదు. తర్వాత రెండుమూడు గంటలు పడుకున్నానో లేదో వీధిలో పెద్ద గల్లంతు విని గాభరాపడి లేచాను. నేను లేచేసరికే అమ్మ, నాన్నారూ లేచి కూర్చున్నారు.

వీధిలో కేకలు వినబడుతున్నాయి. కిరసనాయిలు డబ్బాలను కర్రలతో గొట్టి ధ్వనిచేస్తున్నారు. 'మానుపులి. జాగ్రత్త. మానుపులి జాగ్రత్త' అని మా యింటిముందే కేకలు వేస్తున్నారు. నాకు చెమట లొచ్చేశాయి. గుండె వేగంగా కొట్టుకుంటూంది. నాన్నారు గూడా కంగారుపడుతున్నారు. నాన్నారి వెనకాలే తిరుగుతున్నాను నేను. అమ్మగూడా భయంతో వణికిపోతూవుంది. 'మానుపులి మీ డాబామీదనుండే గురు గురు మంటోందండో' అని మా తలుపులు బాదారు. నా ప్రాణం అమాంతంగా లేచిపోయింది. డాబా మెట్ల



కొత్త పళ్లు

ఫొటో : వీరపనేని కుటుంబరావు (మద్రాసు).

## ★ మాను పులి ★

నుండి కిందికి వచ్చి నన్నెక్కడ యెత్తుకుపోతుందో అని మరింత భయపడి ఒక్కసారే బావురుమన్నాను. నాన్నారు నన్ను కోపం చేసి సముదాయించారు. యేడుస్తూ వుంటే నానోరు నొక్కేశారుకూడా.

ధైర్యంచేసి నాన్నారు వీధి తలుపులు తీశారు. గుంపులోంచి యిద్దరు యువకులు, మా నాన్నారు చేతిలో కర్రలు పుచ్చుకొని మెల్లగా డాబా మెట్లెక్కి ఆజంతువు కిందికి రాకుండా వుండడానికో యేమో డాబా నుండే తరిమిపారేయాలని చూస్తూ నిలబడిపోయినారనుకుంటా. మా నాన్నారు మాత్రం ధైర్యంచేసి డాబామీదికి పొంచి చూస్తున్నారు. గుర్రు... గుర్రు...గుర్రుమని ఏకధాటిగా ధ్వని వినబడుతూనే వుంది డాబామీద.

“అరే పిచ్చినాయనమ్మలారా. మానుపులీ కాదు మనుష్యా కాదు. మా మామయ్యరా. నిద్రలో గురక పెడుతున్నాడు” అన్నారు నాన్నారు పెద్దగా - యింకేముంది. అందరు ఒక్కపెట్టున గొల్లుమని నవ్వారు. ఇంటిముందున్న వాళ్లందరూ డాబాపైకి పరుగెత్తారు. తాతయ్య మాత్రం గురకపెడ్తూ నిద్రపోతూనే వున్నాడు. అందరు పొట్టలు పగిలేటట్టు నవ్వుతున్నారు ఆయన చుట్టూ నిలబడి. ఆయనకు ఆ నవ్వుల పెద్దధ్వనికి మెలకువవచ్చింది. తన చుట్టూ అంతమందిని వాళ్ల చేతులలో కర్రలు అవీ చూచి తాతయ్య గాభరాపడి, ఉక్కిరి బిక్కిరి అయిపోయినాడు. నోరువిప్పి వెర్రివాడిలాగు అరుపులు మొదలెట్టాడు. మా అమ్మ తాతయ్యను భయపడవద్దని చెప్పి, జరిగిన సంగతంతా చెప్పేసింది. కొంతసేపట్లో అందరు నవ్వుతూ ఎవరియిళ్లకి వాళ్లు వెళ్లారు.

తెల్లవారింది. వూళ్లో వాళ్లు తండోపతండలుగా వచ్చి మానుపులి అరచినట్టుగా గురకపెట్టిన మా తాతయ్యను వింతమృగాన్ని చూచినట్టుగా చూచి వెళ్లారు.

తాతయ్య మావూరు వచ్చినప్పుడల్లా ‘మానుపులి వచ్చింది’ అని నేను అన్నానంటే ‘ఛ - ఛడవా’ అంటూ నా లెంపలపై చిటుకులు వేస్తాడు తాతయ్య. ★




శాస్త్రిగారూ, మేము ఎదురూ బదురు ఇళ్ళ కాపురస్థులం. శాస్త్రిగారు మా నాన్నగారి ముఖ్య స్నేహితుడు, అందుచేత ఆయన తరచు వారింటిలో వండిన పిండి వంటలు మాకూ పంపించేవారు; మా ఇంటిలో చేసినప్పుడు, మేము వారికీ పంపించేవాళ్లం.

కోకా
సుబ్రహ్మణ్యేశ్వరరావు (14)
విజయవాడ.

మేము ఎప్పుడే పిండివంట పంపించినా ఆరోజు తప్పకుండా శాస్త్రిగారు మా ఇంటికివచ్చి మా అమ్మ చేసిన పిండివంట ఏమీ బాగా లేదని, తన భార్య చేసినవి చాలా బాగుంటాయనీ, తన భార్యలాగ ఇంకెవ్వరూ ఏ పిండివంటా చెయ్యలేరని, వారి భార్యను, ఆమెచేసే పిండివంటలనూ తెగపొగిడి వెళ్లేవారు.

ఒకసారి ఏదో పండుగవస్తే, మా అమ్మ హల్వా, పూరీలు చేసింది. శాస్త్రిగారింటినుండి బర్ఫీలు వచ్చాయి. మా హల్వా పూరీలు బాగాతిని వాటిని విమర్శించడానికి ఆరోజు సాయంత్రం మా ఇంటికి వచ్చారు శాస్త్రిగారు.

"పూరీలు ఎలా వున్నాయండీ" ఆయనకు స్పెషలుగా ఒక ప్లేటులో పూరీలు పెట్టిఇస్తూ అడిగింది మా అమ్మ.

"ఏమీ బాగాలేవండి. అబ్బే, ఇదేం చెయ్యటమండి! మీకసలు ఇవి చెయ్యటం బొత్తిగా తెలియదు. మా ఆవిడ చేసిన బర్ఫీలు తిన్నారామరి? అమృతం లాగు న్నాయి. చూడండి ఎంతబాగా చేసిందో! అలా వుండాలి ఏది చేసినా! అబ్బెబ్బే! ఇలాగా వుండవలసింది? నేను చెబితే మీకు కోపము వస్తుందేమోగాని, ఒకసారి మా ఆవిడను అడిగారంటే అన్నిరకాల పిండివంటలూ చెయ్యటం ఎలాగో క్షణంలో మీకు నేర్పిస్తుంది. సరే! చాలా సేపయింది. పనుంది, వస్తా"నంటూ గబగబా


తువ్వాయి
ఫొటో: జి. యస్. భూషణ్, మద్రాసు

# రసగుల్లా

వెళ్ళిపోయారు శాస్త్రిగారు ఇంక ఇక్కడుంటే తమ భార్య చేసిన బర్ఫీలకు పెట్టేవంకలు వినాల్సి వస్తుందేమోనని.

అమ్మకు మతిపోయి నట్లయింది. శాస్త్రిగారిచేత చాలా బాగా వున్న వనిపించుకోవాలని అంత శ్రద్ధగా తయారుచేస్తే, ఆయన ఏమీ బాగాలేవని, పైగా తన భార్య చేసిన బర్ఫీలే బాగున్నాయని పొగిడాడయ్యో!

శాస్త్రిగారు వెళ్లిపోగానే అమ్మ నాతో "ఏమిటిరా? ఎంత బాగా చేసినా ఆయనకు నచ్చటంలేదు. ఎలారా, ఆయనకు నచ్చేటట్లు చెయ్యటం?" అంది.

"అమ్మా! నాకో వుపాయం తోచింది. ఆవిధంగా చేద్దామా? దెబ్బతో శాస్త్రిగారి తల తిరిగి నోట్లోకి రావాలి" అన్నాను. అమ్మ చెవిలో వుపాయం చెప్పాను.

నెల తిరక్కుండానే దసరా పండుగ వచ్చింది. విజయదశమి రోజున శాస్త్రిగారింటినుంచీ రసగుల్లాలు వచ్చాయి. మాఅమ్మ గులాబ్ జాములు చేసినప్పటికీ మా ప్లాను ప్రకారం శాస్త్రిగారికి గులాబ్ జాములు పంపలేదు. ఎప్పుడూ ఆరుగంటలకొచ్చే శాస్త్రిగారు, ఆరోజున మా ఇంటినుండి వాళ్లకేదీ వెళ్లక పోవుటవల్ల కాబోలు, నాలుగుగంటలకే వచ్చారు.

శాస్త్రిగారు రాగానే అమ్మ వారింటినుండి వచ్చిన రసగుల్లాలు ఒక ప్లేటులో పెట్టి శాస్త్రిగారి ముందు పెట్టింది. రసగుల్లాలు చూడగానే "మీరూ రసగుల్లాలే చేశారా?" అన్నారు. శాస్త్రిగారు రసగుల్లాలు తినటము పూర్తి చెయ్యగానే మామూలు ప్రకారము, "రసగుల్లాలు ఎలావున్నాయండీ?" అని అమ్మ అడిగింది.

"ఎలా వుండట మేమిటండీ? ఎప్పటిలాగానే వున్నాయి. ఇదేమిటి మీ రెప్పుడైనా రసగుల్లాలనేవి చేశారా? పోనీ — ఎవరన్నా చేస్తుంటేనైనా చూశారా? ఇలాగేనా ఉండాల్సింది? పుల్లగా! చేసింది ఇవాళైనా మూడు నాలుగు రోజులక్రితం చేసినట్లున్నాయి. అబ్బే మీరిక ఇటువంటి పిండివంటలు చెయ్యలేరండీ. చేతగాని వెందుకు చేస్తారు, మెదలకుండా వూరుకోక? మా ఆవిడ చేసినవి చూశారా? ఎంత చక్కగా వున్నాయో; ఒహో హో!... ఇప్పటికిప్పుడు చేసినవిలాగ తియ్యగా ఎంత బాగున్నాయనుకున్నారు. ఎవరు చేసిన పిండివంటలైనా మా ఆవిడ చేసిన పిండివంటలముందు బలాదూరు. మీరు చెబితే వినరుగాని, శుభ్రంగా మా ఆవిడ నడిగుంటే ఇవన్నీ మీకు నేర్పివుండేది. చెయ్యటము తెలియకుండా ఎందుకు చేస్తారు? సొమ్ము దండగ!"

"శాస్త్రిగారూ; ఇంక మీ విమర్శ ఆపండి" అన్నాను నవ్వాపుకోలేక, పకపకా నవ్వుతూ. అమ్మకూడా నాతోపాటు నవ్వుతోంది.

"ఎందుకలా నవ్వుతున్నారు?" అన్నారు శాస్త్రిగారు, ఆశ్చర్యపోతూ.

"ఇప్పుడు మీరు బాగాలేవని అన్నారే, ఆ రసగుల్లాలు మీ భార్యామణిగారు. తయారుచేసి పంపించినవేకాని నేను చేసినవి కావు. ఇవిగో, నేనుచేసిన గులాబ్ జాములు. ఎలా వున్నాయో యిప్పుడు చెప్పండి" అంది అమ్మ, ప్లేటులో గులాబ్ జాములు పెట్టి ఇస్తూ.

"అలాగా?" అని అంటూ గులాబ్ జాములవంక చూస్తూ వుండిపోయారు శాస్త్రిగారు. ఆయనను యింకా ఉడికించాలని "అవునండి. రసగుల్లాలు అసలే మీ బాగాలేవు. పుల్లగా, నాల్గురోజుల క్రిందట చేసినవిలాగున్నాయి" అన్నాను.

"అబ్బే వూరికే అట్లా అన్నాను గాని చాలా బాగున్నాయండి, చాలా సేపయింది. పనుంది వస్తా" అంటూ గబగబా వెళ్లిపోయారు శాస్త్రిగారు, గులాబ్ జాములు రుచి చూడకుండానే.

అప్పటినుండి శాస్త్రిగారు అమ్మ చేసిన పిండివంటలను "బాగున్నాయి" అని మెచ్చుకోవటం తప్ప, బాగా లేవనిగాని, తన భార్య వండితేనే బాగుంటాయని గాని అనటం మానుకొన్నారు.



# సరికొత్త పండగ

వినాయక చవితి, దసరా, దీపావళి, సంక్రాంతి పండుగల మాదిరివి కాక మనదేశంలో ఈమధ్య ఆగస్టు 15 వ తేదీనీ, జనవరి 26 వ తేదీనీ కొత్తరకం పండుగలు జరుపుకుంటున్నాం. ఈ కొత్త పండగలకి పసుపుకుంకాలతో దేవుళ్ళని అలంకరించడం, పువ్వులూ పత్రితో పూజించడం, కొత్తబట్టలు కట్టుకోడం, పిండివంటలు చేసుకుతినడం ఉండవు. దేశంలో పెద్దలూ ఊరి పెద్దలూ ఉపన్యాసాలిస్తారు, జండాలు ఎగరేస్తారు. కొందరు కొందరు గుంపులు గా బయలుదేరి జండాలతో ఊరేగుతూ పాట లేనా పాడతారు, లేకపోతే వాళ్ళకి జై, వీళ్ళకి జై అంటూ బిగ్గరగా అరుచుకుంటూ ఊరేగుతారు.

ఇలాటి కొత్తరకం పండగే మన తెలుగు వారందరికీ సరికొత్త పండగొకటి వచ్చింది.

గడిచిన అక్టోబరు 1 వ తేదీని మన ప్రధానమంత్రి పండిట్ నెహ్రూగారు స్వయంగా కర్నూలువచ్చి ఆంధ్రరాష్ట్రానికి ప్రారంభోత్సవం జరిపారు. ఇంక ఏటేటా అక్టోబరు 1 వ తేదీని, అంటే గాంధీగారి జయంతి ఉత్సవం కేపనగా, ఆంధ్రరాష్ట్రం అంతటా మనం ఆంధ్ర రాష్ట్రోత్సవం జరుపుకుంటా మన్నమాట.

మన సరికొత్త తెలుగు పండగనాడు కూడా పాత పండగల్లో మాదిరే ఎవరైనా కొందరు పిండివంటలు చేసుకుతింటే తిన వచ్చు; పూజలూ పురస్కారాలూ మాత్రం ఉండవు.

ఇది కూడా మనకి గొప్పపండుగ ఎందుకైందంటే—

ఇటువంటి రోజుకోసం నలభైయేళ్ళ నించి మన నాయకులు, ప్రజలందరూ కలలు కన్నారు. ఎంతమందో ఎన్నెన్నో త్యాగాలు చేశారు. సుఖాన్ని త్యజించి కష్టాలపాలైనారు. మన బాధ తెలియలేని వాళ్ళవల్ల నిందలూ దూషణ తిరస్కారాలూ పడ్డారు. పొట్టిశ్రీరాములు అనే మహత్తర వ్యక్తి దీక్షపట్టి అన్నపానాదులు మానివేసి చివరికి పూర్ణాహుతి అయినారు. ఆంధ్ర రాష్ట్రంకోసం తపించిన నాయకుల్లో కొందరిప్పుడులేరు. దేశభక్త కొండ వెంకటప్పయ్యగారు, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు మొదలైన నాయకులు పాపం ఈ పుణ్యదినం చూడ లేకపోయారు. కొందరికి చూసే అదృష్టం కలిగింది. ప్రకాశం పంతులుగారికి మొట్ట మొదటి ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి కావాలనే వాంఛతీరింది. ఇంతమంది ఈ రాష్ట్రం కోసం ఎందుకు తపించారంటే, గ్రామాలకూ పట్నాలకూ పాకిపోయిన రాజకీయ చైతన్యం ప్రజలకు పూర్తిగా లాభదాయకం కావాలంటే రాజకీయాలు తెలుగు మాత్రమే తెలిసి ఇంగ్లీషు రానివారికి చేరువ కావాలి. నాయకులు ప్రజలతరఫున ఏవేం మాట్లాడుతున్నారో ఏంచేస్తున్నారో ప్రజలకి తెలియాలంటే పరిపాలన అంతా తెలుగులోనే నడవాలి. శాసనసభల్లో అందరూ తెలుగులో మాట్లాడాలి. గ్రామాలపైనా గ్రామస్థులపైనా అధికారం చెలాయించేవారు తెలుగులో చెలాయించడం మంచిది. ఇదికాక మద్రాసు రాష్ట్రంలో ఒక్క భాగంగా మాత్రమే ఉండిపోడంవల్ల మనదేశం విద్యుచ్ఛక్తి, పరిశ్రమలు, నీటికాలువలు బాగా వృద్ధిపొందలేదు. మన దేశంలో నేల, కొండలు, గుట్టలు, నీరు మనకి సర్వసంపదల్నీ ఇవ్వగలవు. అయినా ఏవీ వృద్ధికానందువల్ల మనం అన్నివిధాలా (మిగతావాళ్ళతో పోలిస్తే) వెనక పడిపోయున్నాం.

ఈ పరిస్థితిపోయి మనదేశంలో సంపదలు వృద్ధిచెంది, మన ప్రజలు అన్నానికీ వస్త్రానికీ మొహం వాచకుండా ఉండాలంటే రాష్ట్రం అవసరం అయింది.

అయితే మనకి రాష్ట్రం ఓ పట్టాన సులువుగా రాలేదు. చాలామందివల్ల నిందలు పడ్డాం. (ఇంకా పడుతున్నాం) దీనివల్లి మనకేకాకుండా భారతదేశం అంతటికీ ముప్పుగా పరిణమిస్తుందేమో నని పెద్దల భయం. ఇది నిజానికి ముప్పుకాదనీ, ఇతర భాషలవారంటే మనకి ద్వేషం అసహనం లేదనీ, భాషల ప్రకారం రాష్ట్రాలు నిర్మించడంవల్లే అసలు జాతీయవికాసం సక్రమంగా కలుగుతుం దనీ నిరూపించవలసిన కర్తవ్యంమ్మనందరిమీదా పడింది. ★

# కాలక్షేపం

ఒక కుచమాని, పాల్ గుడియు
నొక్క కుచంబొక కేల బూని, యా
ముకుళిత నేత్రుడై, జనని
ముద్దునకుం జూచుకంబు వ్రేలఁ దా
ట్టకముగ నంటు, మోవిఁ బ్రకటంబగు
లేనగ వొప్పు శౌరి, దు
గ్ధకణ సమేతదంత రుచి
తత్పరతన్ నను బ్రోచు గావుతన్॥

మనలను రక్షించవలసినది ఎవరు? ఈ పద్యంలో చెప్పబడిన ప్రకారముగా అయినట్లయితే, శ్రీకృష్ణుడు కాదు. ఆ శ్రీకృష్ణుడు చంటిబిడ్డగా ఉన్నప్పుడు యశోదాదేవి వద్ద పాలు త్రాగుచున్న సందర్భంలో ఆ బిడ్డయొక్క గడ్డమును ఆమె ముద్దుచేత నిమిరినప్పుడు, ఆ బిడ్డ వివిధముగా ఎంత శోభాయమానంగా నోరుతెరచి పాల చుక్కలు చిందినటువంటి తన చిన్ని తెల్లని దంతములు ప్రకాశించేటట్లు చిరునవ్వు నవ్వెనో, ఆ చిన్న బిడ్డ చిరునవ్వులే మన లను రక్షించవలె నన్నాడు. ఆ చిరునవ్వు ఎక్కడా? ఆ చిన్నికృష్ణుడు ఎక్కడా? ఈ పద్యం వ్రాసిన కవియొక్క అభిప్రాయమునుబట్టి చూస్తే ఆచిరునవ్వు ఒక్కటే పరమాత్మ స్వరూపం అన్నట్లుగా ఉంది. ఆనంద స్వరూపుడైన భగవంతుడు ఆ కవికి ఆ రూపంలో సాక్షాత్కరించి ప్రత్యక్షమైనాడు. సత్తు, చిత్తు, ఆనందం యివి భగవంతుని లక్షణాలు. మోక్షం అంటే ఏమీ లేదు. అపరిమితమైన ఆనందంలో సదా మునిగి ఉండడమే అన్నారు. సెబాస్! అంతకంటే ఇంకేమి కావాలి? చిన్న పిల్లవాడైనా, బొజ్జనిండా పాలు త్రాగినప్పుడే ఆనందిస్తాడు. బిడ్డకు ఆకలియైనప్పుడు తల్లివచ్చి పాలు యివ్వకుండా, మడికట్టుకొని, యింటో గోపాలకృష్ణుని పటమునకు పూజ చేస్తూ విష్ణు సహస్రనామాలు చదువుకుంటూ ఉన్నట్లయితే, ఉయ్యాలలో పడున్న బిడ్డ మరింత వెక్కివెక్కి ఏడుస్తాడు. "అబ్బా! వీడు ఏ నక్షత్రమున పుట్టినాడో గాని, నాకు ఊపిరి ఆడనివ్వడు. రవ్వంతసేపు 'కృష్ణా! రామా!' అనుకో

# కలవారి అబ్బాయి

నెమలికంటి భారతలక్ష్మి (14) తెనాలి

కలవారి అబ్బాయి రాముడనువాడు
పండుగకు క్రొత్త ఉడుపులు తొడిగినాడు.
తళతళా మెరిసేటి పట్టుచొక్కాయి,
పట్టులాగూ చూచి మురిసె నబ్బాయి.

"ఇంటిలో కూర్చుంటె ఎవడు చూస్తాడు?"
అని మనసులో రాము డూహించినాడు.
"ఆడుకొంటానమ్మ! బయట" నన్నాడు,
అమ్మ అన్నది "బయటి కెళ్లకబ్బాయి,
క్రొత్తబట్టలు నీవి, మాసిపోతాయి."

కాని ఆ అబ్బాయి మాట వింటాడా?
అందులోనూ క్రొత్త బట్టలేశాడాయె!
తుదకు మనసును పట్టలేకపోయాడు
నడిచేయ కెట్లాగొ బయటపడ్డాడు.
చింకి బట్టలవాడు, జిబ్బితలవాడు,
ఒంటిపై దుమ్మున్నవా డెదురువచ్చాడు.

రాము డప్పుడు త్రోవ తొలగిపోగాను,
అరటితొక్కను తొక్కి కాల్జారి పడిపోయి
చూడసాగాడు ఆకాశమున కేసి.

పేదపిల్లడు అతని లేవదీశాడు,
చేయూత ఇచ్చాడు, దుమ్ము దులిపాడు.
"భయపడకు, పాప"మని ఊరడించాడు
ఇంటివరకూ రాము నంపివచ్చాడు.

తల చెరిగి, వలువలూ మాసిపోయినతీరు
దాచకుండా తల్లితో చెప్పివేశాడు.
పల్లెత్తు మాటైన అనలేదు తల్లి
చిరునవ్వు నవ్వి తల పంకించినాది.

మరునాడు నిరుపేద మరల ఎదురైనాడు
రాము డతనిని చూచి తొలగిపోలేదు
ఒకరి కొక్కరు ప్రాణ మిత్రులైనారు.

నివ్వను. పీడి గొంతుక కంచు గొంతుక! "కేశవ! నారాయణ!" అనగానే "క్యావు! క్యావు!" మని మేళం చేస్తాను. నాకి జన్మలో యీ సంసార కూపంలోనుంచి బయటపడే యోగ్యత లేదు." అని పసి శిశువును చూచి కసరుకొని విసువు జెందెడి తల్లులకు నిజంగా ఆ సంసారకూపంలో ఆనందం కన్పించదు. సంతానంకోసం అనేక అశ్వత్థ ప్రదక్షిణాలు చేసే వాళ్ళు ఉన్నారు. నాగలింగ ప్రతిష్ఠలు చేసేవాళ్లూ ఉన్నారు. కన్పించిన చెట్టుకూ పుట్టకూ మ్రొక్కి, సతమతమై శతవ్రతాలు చేసినవాళ్ళూ ఉన్నారు. సంతానంకోసం—

"కాంతాకాంతులు సంతత మ్మిటు లుమా
కాంతాది సద్దేవతా సంతానమ్ము భజించి...
ఆత్మసుఖ భోగేచ్ఛల్ విసర్జింపుచున్"

తపించడం ఎందుకు? బిడ్డలకోసం అడ్డమైన దేవుళ్లకు మ్రొక్కడంలో ఉద్దేశమేమిటి? ఆస్తికీ రాజ్యానికీ తగిన వారసుడు కావలెననే తాపత్రయంచేత సంతాన వాంఛ ఉంటుందని అంటారు. దశరథ మహారాజులుంగారు అందుకోరకే, పుత్రకామేష్టి చేశారని లౌక్యంగా వాదించవచ్చు. భార్యాభర్తలు ముసలివాండ్లయినప్పుడు వాళ్ళను కని పెట్టి కాపాడగల బిడ్డలు చేతికి అక్కరకువచ్చిన వాళ్ళూ, రెక్కలు వచ్చిన వాళ్ళూ ఉండాలి గనుక, తన చేతిరొక్కం తనకు అక్కరకు వచ్చినట్లుగా తన చేతిబిడ్డ తనకు అక్కరకు రాగలడని ఆశిస్తారు. కాని చిట్టచివరకు పెరిగి పెద్దవాడై పితృవాక్య పరిపాలన చేసెడి శ్రీరామచంద్ర మూర్తులు కూడా వీ దండకారణ్యములకో వెళ్లి అక్కడ ఫారెస్టు ఆఫీసరు లాగున ఉద్యోగాలు చేస్తూ, వ్యాపారాలు చేస్తూ ఉన్నట్లయితే, ముసలివాండ్లయినట్టి తల్లియున్నా తండ్రియున్నా యింటివద్ద సుందరకాండ పారాయణం చేస్తూ, తమ ఉత్తరగతి తామే చూచుకుంటూ, బిడ్డలవద్దనుంచి ఉత్తరాల కోసం ఎదురుచూస్తూ, "మనసా! శ్రీహరి పాదము లాశ్రయింపుమా!" అని ఆత్మారామునకు మేలుకొలుపులు పాడుతూ, బిడ్డల శుభవార్తలు రాని రోజున ఆర్తనాదము చేస్తూ, "రిక్తవ్యర్థ సంసారముల్" చేసేవాళ్లుకూడా ఉన్నారు. కాని అన్నింటికంటే మించిన మరొక తరగతి శిష్టాచార గరిష్ఠులూ వున్నారు. తాము యీ లోకంలోనుంచి పరలోకానికి (పితృలోకానికి) వెళ్ళిన తర్వాత తమకు అక్కడ సౌఖ్యంగా జరుగుబాటుగా ఉండుటకున్నూ అక్కడ తమ ఆకలిదప్పులు తీరుచుండుటకున్నూ తమబిడ్డలు యీలోకంలో తమ పేరుతో పిండ ప్రదానములు చేసి శ్రాద్ధకర్మలు చేయవలసి ఉంటుంది గనుక, అందు నిమిత్తమై బిడ్డలు

# బొమ్మల కొలువు

టి. రంగమ్మ (13) పార్వతీపురం.

ఇరుగింటి ఇందిరా
పొరుగింటి పద్మినీ!
రండమ్మ పెడదాము
బొమ్మల్ల కొలువు.

కొలువులో క్రిష్ణమ్మ
గోవులను కాయాలి.
గోపికాస్త్రీలంత
గొంతెత్తి పాడాలి.

కమలనూ విమలనూ
పిలుచుకొని రారండి!
దసరాకి వేడుకలు
చూడమని చెప్పండి.

ఏనుగులు గుఱ్ఱాలు,
ఎనుపోతు బలగాలు,
సింహమ్మూ, చిట్టెలుక
సీమపందులతోడ——

కొలువెల్ల అడవిగా,...
కలకలలాడాలి.
కొలువులో మనమంత
ఖుషీగా ఉండాలి.

ఆబొమ్మ యీబొమ్మ,
అలివేలు మంగమ్మ,
తిరుపతీ వెంకన్న,
సింహాద్రి అప్పన్న,

రామన్న లక్షన్న,
హనుమన్న భీమన్న,

బొమ్మలన్నిటి నిచట
గుమ్మరిద్దాము.
కోటిబొమ్మలతోటి
కొలువు పెడదాము.

అర్జునా ఫల్గుణా
కిరీటీ విజయుడూ,
శ్రీకృష్ణ దేవుడూ,...
రథమెక్కినంతనే
రణభేరి మ్రోగాలి.

ఓడాలి కౌరవులు
మనకొలువునందునా.
నవ్వాలి మనమంత
మువ్వల్లు రాలగా!
మ్రోగాలి జయభేరి
ధుమ్ ధుమా! ధుమ్ ధుమా!

అందాల మన కొలువు
చందాల మన కొలువు
చిందేటి వెలుగులూ
సూర్యదేవునికన్న
శోభగా ఉండాలి!
చంద్ర దేవునికన్న
చక్కగా నుండాలి!

పడపప్పు చలిమిడీ
అటుకుల్ల భోగములు
దేవికీ చెల్లించి
దీవెనలు పొందాలి!
హారతులు వెలిగించి
మంగళం పాడాలి!

# ★ కాలక్షేపం ★

ముఖ్యంగా ఉండవలెనని వాదిస్తారు. ఈ లోకంలో తమకన్న బిడ్డలు తమ కన్న పానా దులను వార్షికంగా పార్శిలుచేసి పరలోకానికి పంపిస్తూ ఉండవలెనని ఉద్దేశించి, పుత్రులు లేనివారికి గతులు లేవని వాదించి, ఇహాన్నీ పరాన్నీ ఆవిధంగా జతపరిచారు.

కాని యింతదూరం, వాదించవలసిన అగత్యం లేనేలేదు. తల్లికీ బిడ్డకూ మధ్య దూరం ఏమీలేదు. సంతానంగాని బిడ్డలు పాపలుగాని మనుష్యులకు మాత్రమే ఉన్నారా? ఆవులకు దూడలున్నాయి. పిల్లులకు కూనలున్నాయి. ఆ దూడ వచ్చి పాలు త్రాగకపోతే, తెల్లవారుజామున ఆవు "అంబా!" అని అరుస్తుంది. ఆ దూడవచ్చి తన పాలుత్రాగితే, ఆవుకు ఆత్మశాంతి కలుగుతుంది. ఆవు పొదుగులోని పాలు ఎవరికోసం? దాని బిడ్డలకోసం. ఆ పాలతో దూడకు కడుపునిండితే, ఆవుకు కడుపునిండినట్లుంటుంది. మరొకడు ఆ పాలు పిండుకొనితాగితే, తనదూడ ఏడుస్తే, తల్లిప్రాణం తల్లడిల్లిపోతుంది.

అదేవిధంగా భారతమాతకు భారతీయులందరూ బిడ్డలే. భారతీయులందరూ సోదరులే. కాని, సోదరభావం వృద్ధిచేయడానికి సోదర సంహారం చేసినట్లయితే, సోదర భావమునే సంహారం చేసినట్లవుతుంది. అందువల్ల కమ్యూనిజంలో నిజంలేదు. దానిలో స్థిరమైన ధర్మం, శాశ్వతమైన సత్యం ఉంటే మాస్కోవైపు తిరిగి అదిగో మాస్కో భూతలస్వర్గం అననక్కరలేదు. మాతృదేశమునకే ఆత్మార్పణం చేయవచ్చు. తన సోదరులకోసం తపోనిష్ఠాగరిష్ఠుడై తపస్సుచేసి ఆత్మార్పణం చేసినవాడే అసలైన కమ్యూనిస్టు గరిష్ఠుడు. అట్టివారికి వసిష్ఠుడు మహోత్కృష్టుడు. ఆంధ్ర తపోవనములో వెలసిన గరిష్ఠుడు పాటి శ్రీరామయోగి. కులవిద్వేషాలతో కాలేజీలూ, కచ్చేరీలూ, నియోజక వర్గాలూ, మంత్రివర్గాలూ,

మలినభావకోష కలితమైవరలుచో
మాతృభావ మెట్లు మనకు గల్గు?

ఆంధ్ర రాష్ట్రం పుట్టింది నేడు. కాని, ఆంధ్రవిష్ణువు యీనాడు పుట్టినవాడు కాడు. కృష్ణానదీ ముఖద్వారం వద్ద నేటి కృష్ణాజిల్లాలో శ్రీకాకుళంలో ఉన్నాడు శ్రీకాకుళస్వామి. అతడే ఆంధ్రవిష్ణువు. శ్రీకాకుళాంధ్ర దేవుడు. 2500 సంవత్సరముల క్రిందట, శాతకర్ణ చక్రవర్తులలో రెండవవాడైన విష్ణుశాతకర్ణుడు మొట్టమొదట యీ కృష్ణానదీ ముఖద్వారమువద్ద శ్రీకాకుళములో ఆంధ్రరాజ్య ప్రతిష్ఠాపన చేసి వాసిగాంచెను. అతడే ఆంధ్రవిష్ణువుఅని ఆనాటినుండియు ఆరాధింపబడుచున్నాడు. శ్రీకృష్ణదేవరాయలవారు కళింగదేశ దండయాత్రలు ముగించి తిరిగి (హంపి) విజయనగరమునకుపోవుచు మార్గమధ్యమందు బెజవాడలో దిగి, కనకదుర్గను సేవించి శ్రీకాకుళమునకేగి అచటి ఆంధ్రవిష్ణువునకు అభిషేకములు చేయించి చరితార్థుడయ్యెను. ఆంధ్రచరిత్రలో అఖండవిఖ్యాతుడయ్యెను.

ఆంధ్రవిష్ణువు ఆంధ్రరాజ్యానికి అధిష్ఠాన దైవము. ఆంధ్రజాతి అప్రతిహత ప్రతిభా ప్రతాపప్రభావములతో వర్ధిల్లుటకు ఆంధ్రవిష్ణువు ఆశీర్వాదం కావాలి. శ్రీకాకుళాంధ్రదేవున కభిషేకములను ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వము అత్యంత శ్రద్ధాసక్తులతో జరిపించుట అవశ్య కర్తవ్యము. ఆంధ్రజాతికి ప్రాణప్రతిష్ఠ జరిగిన తొలి పుణ్యక్షేత్రమిది.

ఆంధ్రమాత అంటే ఆంధ్రాకాశంలో ప్రకాశించడం లేదు. ఆంధ్రభాషమాట్లాడే ప్రతి ఆంధ్రునిలోనూ ఆ తల్లి పోలికలు ఉన్నాయి. త్యాగరాజుగారిలో తెనుగు తల్లి రక్తం ఉంది. వేమన, పోతన తెనుగు తల్లి పాలుతాగిన యోగులు. నాగార్జునాచార్యుడు తెనుగుతల్లి చేతులలో పెరిగిన సకల శాస్త్ర పారంగతుడు. తెనుగుతల్లి ఎక్కడ ఉంది అంటే, మన యింట్లో ఉంది. ప్రతిబాలుడూ, ప్రతి బాలికా "మాతృదేవో

## ★ మైసూరు దసరా ఉత్సవాలు ★



మైసూరు రాజప్రముఖ భవనం—ఫొటో కె. వి. కృష్ణవేణి—మైసూరు.



విద్యుద్దీపాలతో అలంకరించబడిన మైసూరు రాజప్రముఖ భవనం
(ఫొటో డి. ఎస్. అంబూరావు—మదరాసు)

భవ!" అని తెల్లవారి నిద్రలేవగానే తన యింటిలో తన్ను కన్న తల్లికి, తన్ను పెంచెడి తల్లికి నమస్కారంచేస్తే చాలు. తెనుగుతల్లికి నమస్కారం చేయగల్గిన ఆత్మ సంస్కారం కలుగుతుంది.

బాలుల్లారా! బాలికలారా!
పాలు యిచ్చినదె తల్లీ!
తన రక్తములో
పాలు యిచ్చినదె తల్లీ!

మాతృభక్తి అనేది అభ్యాసం చేసుకొంటే, ఆంధ్రమాత మీద భక్తి అవలీలగా ఏర్పడుతుంది. ఇంకా ఆఖరుమెట్టుకు వెళ్ళితే, లోకమాత అంటే ఏమిటో, జగజ్జనని అంటే ఏమిటో సాధకం చేసినవానికి విధిగా బోధపడుతుంది. ఆ దేవీ స్వరూపం అర్థం కావాలంటే దేవీ నవరాత్రులలో జరిగే పూజలు బోధపడాలి.

శ్రీకృష్ణుడు యశోదవద్ద పాలు త్రాగుతూ ఉంటే, ఆ బిడ్డయొక్క గడ్డమును ఆమె నిమిరినప్పుడు ఆమెవంక ఓరచూపులు చూస్తూ, పాలచుక్కలతో తన లేత పెదవులమీద చిరునవ్వు చిందులు త్రొక్కుచుండగా, తెల్లని చిన్ని దంతములపై ప్రకాశించెడి కాంతి మనలను రక్షించుగాక! ఆ కృష్ణుడు పుట్టినది దేవకీదేవి గర్భమందు పాలు త్రాగినది యశోదాదేవి వద్ద. అతడు ఎవరి బిడ్డయని చివరకు నిర్ణయించగలము? అదే వైష్ణవమాయ. "ఆంధ్రుడు అంటే ఎవరు? వింధ్య పర్వతాలు దాటి ఉత్తర దేశంనుంచి దక్షిణదేశానికి వచ్చి త్రిలింగ రాజ్యంలో ఆంధ్రుడు ప్రవేశించాడు. తెనుగు తల్లిచేత పోషింపబడి శేముషీ ధురంధరుడై తెలుగు రాజ్యానికొక వెలుగు తెచ్చాడు. దేవకీదేవిబిడ్డ యశోద పయస్సు త్రాగి అవతార మూర్తియై యశస్సు పొందినవిధంగా, ఆంధ్రమాత పుత్రుడే తెనుగుతల్లి బిడ్డయై కృష్ణా గోదావరీ ప్రాంత విహారం చేసి పెరిగి పెంపొందినాడు. నేడు అవతరించిన అవతార మూర్తివలె, బాలగోపాలునివలె నవ్యాంధ్రరాష్ట్ర శిశువు తన తల్లి పాలు త్రాగుటకు ప్రారంభించింది. చేజిక్కిన ఆంధ్రరాష్ట్రము నొక పయోధరమువలె నోటబెట్టుకొని పాలు త్రాగుచున్నాడు. కాని ప్రక్కనున్న మరొకకుచమును తన చేతితో స్పృశించుచున్నట్టుగా, ప్రక్కనున్న తెలింగాణా కొరకై చేయిజాచుచున్నాడు. ఆంధ్రరాష్ట్ర పయఃపానము చేయుచున్న ఆంధ్రపుత్రుడు విశాలాంధ్రకై చేయి జాచుచున్నాడు. అది జూచి ఆంధ్రమాత తన ముద్దుబిడ్డ గడ్డమును చేత బుడికి నిమురుచున్నది. ఆంధ్రపుత్రుడు తన కన్నులు కన్నతల్లిపై నిగిడ్చి పాలబిందువులు చిందుచుండెడి పెదవులతో, ఆనందంతో తన తెల్లనిదంతకాంతులు ప్రకాశించునట్లుగా చిరునవ్వు నవ్వుచున్నాడు. ఆ చిన్ని పెదవులనుండి వచ్చెడి ఆ శిశువు యొక్క దంతకాంతులే మనలను రక్షించుగాక!

"దుగ్ధకణ సమేత దంత రుచి
తత్పరతన్ నను బ్రోచు గావుతన్."

ఇంత మనోహరమైన ఇంత మంగళకరమైన మాతా శిశు వాత్సల్యాను రాగానుబంధ దివ్యస్వరూప నిరూపణ ప్రవీణతకు సాటియైన మేటి పద్య మింకొక సాహిత్యంలో నభూతో నభవిష్యతి యని సవాలు చేసి గడగట్టె భేరికా డాండడ డాండ డాండ నినదంబు లజాండమునిండ మత్తవేదండము నెక్కి" బాహాటముగా చాటింపవచ్చు. ★

—దాసు వామనరావు.

## కొందరు బాలతారలు.



బేబీ మల్లిక
మొదటిచిత్రం "పల్లెటూరిపిల్ల"; తిరుగుబాటు, లక్ష్మమ్మ, మల్లీశ్వరి, ఆడబ్రతుకు చిత్రాల్లో నటించింది.



దువ్వూరి అన్నపూర్ణ
ప్రస్తుతచిత్రం "చంద్రహారం"

# ★ చిత్రాల్లో బాలనటులు — మధుమూర్తి ★

పాతికేళ్ళక్రితం, సినిమాలకు ఇంకా మాటలురాని రోజుల్లో, వెండితెర ముందు కూర్చున్న ప్రేక్షకులు వింతగా బొమ్మల్ని, వాటిల్ని, నటనని చూసి ముగ్ధులౌతున్న రోజుల్లోనే ఒక బాలనటుడు యావత్ప్రపంచానికి పరిచయమయాడు. అతని పేరు జాకీకూగన్

1920 సంవత్సరంలో చలన-చిత్ర పరిశ్రమకు పదేళ్ళవయస్సు ఉంటుంది. అప్పటికింకా చిత్రానికి చలనమే గాని మాట అలవడలేదు. ఐనప్పటికి నిశ్శబ్ద చిత్రాల నిర్మాణం అమెరికాలో అనతికాలంలోనే అంచెలమీద ముందంజవేసింది. అప్పటికే చార్లీ చాప్లిన్ ప్రపంచానికి పరిచయమవటమే కాకుండా ప్రజానీకానికి సినిమా ఇవ్వగలిగే వినోదపు విలువను చూపెట్టాడు. 1920 లో "కిడ్" అనే మూగచిత్రం తయారైంది. అది ఒక అనాథబాలుడి జీవితం. ఆ అనాథకు పెంపుడుతండ్రిగా చార్లీ చాప్లిన్ తటస్థపడతాడు. ఆనాటి సాంఘిక వ్యవస్థలోని ఎగుడుదిగుడులను కథగా ఎంచుకుని నిర్మాతలు "కిడ్" ని నిర్మించి చార్లీచాప్లిన్ని, జాకీకూగన్ని తెరకు పరిచయంచేసి తారలు వయోజనులయి మాత్రమే ఉండనక్కర్లేదనీ, బాలలుకూడా నటులేనని రుజువు చేశారు. "కిడ్" లో కూగన్, చాప్లిన్లు పోటీపడి అత్యుత్తముంగా నటించారు.

ఈ చిత్రం భారతదేశానికి 1924 ప్రాంతంలో వచ్చి ఉంటుంది. మూగసినిమాలు చూపటం నేర్చుకుంటున్న భారతీయుల హృదయాలను కూగన్, చార్లీలు ఆకర్షించారు. ఐతే హాలివుడ్ బాలతారల్లో కూగన్ ప్రథముడు మాత్రం కాదు. అమెరికాలో సైలెంట్ చిత్రాల నిర్మాణ ప్రారంభదశలోనే బాలతారలు ఉద్భవించారు. కూగన్ను మూడవవాడుగా పేర్కొనవచ్చు. మరొక బాలతార మేరీ డోరా. ఈమె సైలెంట్ చిత్రాల రోజుల్లో 1916 లో పేరమౌంట్ పిక్చర్స్ వారి "ఆలివర్ ట్విస్ట్" చిత్రంలో ట్విస్ట్

పాత్ర నిర్వహించింది. ఒక బాలిక బాలుడి పాత్ర ధరించింది!! 1917 లో మరొక బాలనటి ఉద్భవించింది. ఆమె పేరు మాడ్జి ఇవాన్స్. "ఎడ్వెంచర్స్ ఆఫ్ కరోల్" అనే సైలెంట్ పిక్చర్‌లో నటించింది. వీరిదరికంటె ముందు ప్రవేశించి ప్రప్రథమ బాలతార అని ఖ్యాతి గడించిన నటి బెస్సీ బారిస్కేల్. 1914 లోనే ఆమె హాలీవుడ్‌లో అడుగు పెట్టింది. మరి నాలుగేళ్ల అనంతరం ఆమె నిర్మాత అయి బి. బి. ఫీచర్స్ అనే సంస్థపెట్టి "జోసలెన్స్ వైఫ్" అనే చిత్రాన్ని తయారు చేసిందటకూడా!! ఐతే ఆమె చేసిన ఘనకార్యం ఒకటి ఉంది. బాలతార దశనుంచి పెద్దదై, నిర్మాతగా ఉండి తీసిన పై చిత్రంలో ఒక బాలనటుణ్ణి ప్రవేశపెట్టింది. అతని పేరు బెన్ అలెగ్జాండర్.

సైలెంట్ చిత్రనిర్మాణంలో కూడా ఆధిపత్యం అమెరికాకే ఉండేది. అందుచేత హాలీవుడ్‌లో ఆ రోజుల్లో జాకీ కూగన్, బెన్ అలెగ్జాండర్లు బాలనటులుగా ఆధిపత్యం వహించారు. 1929 లో హాలీవుడ్‌లో టాకీ చిత్రనిర్మాణం ప్రారంభం అయ్యేవరకు ఈ తొలి బాలతారలు మంచి డిమాండ్‌లో ఉంటూవచ్చారు. ఐతే అప్పటికి వాళ్లు పెద్దలయ్యారు. కొత్తవారికి స్థానం ఇస్తూండేవారు. టాకీల కాలానికి కూడా నటుడుగా ఉన్న వ్యక్తి పై తారలలో ఒకడే. బెన్ అలెగ్జాండర్ మాత్రం "ఆల్ క్వయట్ ఆన్ ది వెస్టర్న్ ఫ్రంట్" అనే టాకీ చిత్రంలో నటించాడు. అంతటితో అతని నటనా జీవితం కూడా ముగిసింది.

భారతదేశ చలనచిత్ర పరిశ్రమ ప్రారంభంలో సైలెంట్ చిత్రాల దశ అంతగా ఘనత వహించలేదు. పాశ్చాత్య దేశాలలో ఒక్క హాలీవుడ్‌లోనే కాకుండా జర్మనీ, ఫ్రాన్స్, స్వీడన్, రష్యాలలో సైలెంట్ చిత్రయుగం మహోన్నతమైన పునాదులపై ప్రారంభమై దివ్యమైన దశకు రాగలిగింది. సైలెంట్ చిత్రాల దర్శకులలో ప్రపంచ ఖ్యాతిగడించిన గ్రిఫిత్, పుడోవ్‌కిన్‌లు నేటికీ ఇతరులకు ఆదర్శప్రాయులై ఉన్నారు. మనదేశంలో నిశ్శబ్ద చిత్రాల మొత్తం నిడివి చాలతక్కువ. 1911లో కాని మనదేశంలో సైలెంట్ చిత్ర నిర్మాణం జరుగలేదు. అప్పటికే పాశ్చాత్యదేశాలవారు ఎంతో ముందడుగు వేశారు. 1918 లో కాని మనదేశంలో సక్రమ చిత్రనిర్మాణ సంస్థ ఉద్భవించలేదు. 1920 కి కాని మనకు నిశ్శబ్దచిత్రాలను చూపే పరికరాలులేవు. అందుచేత మనదేశంలో ఎన్నో సైలెంట్ చిత్రాలు (వీటి సంఖ్య వందల మీద నే ఉన్నది) తయారైనప్పటికీ బాలతారలను పరిచయం చేయగల అవకాశం లభించలేదు. మాస్టర్ విఠల్, సాహూ మోడక్ లుమాత్రమే మన నిశ్శబ్దచిత్రాలలోని "బాల" తారలని చెప్పుకోవాలి.

ఐతే టాకీ యుగోదయం అయిననాటి నుంచి మన పరిశ్రమ పురోభివృద్ధి పొందే

## కొందరు బాలతారలు.



రామకృష్ణ
మొదటిచిత్రం "లైలామజ్నూ";
ప్రస్తుతం ప్రకాశ్ వారి బాలచిత్రాలు.



సుధాకర్
మొదటిచిత్రం "దీక్ష"; ప్రస్తుతచిత్రం "రాజు-పేద"

# కొందరు బాలతారలు.



మాస్టర్ లక్ష్మణ్

మొదటిచిత్రం "దీక్ష";
ప్రస్తుతం ప్రకాశ్ వారి బాలచిత్రాలు.



మాస్టర్ కుందు

మొదటిచిత్రం "గుణసుందరి"; ప్రస్తుతం ప్రకాశ్ వారి బాలచిత్రాలు, రోహిణీవారి "బీదల ఆస్తి"

## ★ చిత్రాల్లో బాలనటులు ★

స్థితివచ్చిందని చెప్పక తప్పదు. టాకీలు 1931 లో మనదేశంలో అడుగుపెట్టాయి. ఉత్తరదేశంలోనే ఈ పరిశ్రమకు ప్రారంభోత్సవం జరిగింది. చిత్రానికి మాటలాడడం అలవడిన వెంటనే వాటికి ప్రాంతీయ విభజన జరిగింది. శబ్దరహితంగా ఉన్నప్పుడు చిత్రానికి ఉండే అంతర్జాతీయత శబ్దసహితంగా ఉంటే రాకపోవటం సహజమైన మార్పే. అందుచేత తెలుగుభాష పలకడం నేర్చిన చలనచిత్ర పరిశ్రమ ప్రథమంగా "బాల"భక్తుడి జీవితగాథనే ఎన్నుకోవడం బాలనటులు గర్వించదగినవిషయం.

"భక్తప్రహ్లాద"తో బాలనటుల దశ ప్రారంభమైంది. ఐతే అంతమాత్రంచేత ప్రథమదశలో ఉన్న చిత్రనిర్మాతలకు, దర్శకులకు బాలతారలపై భక్తి ఉండేదని గాని, బాలతారల ప్రభావం చిత్రవిజయంపై అధికమనే సంగతి తెలుసునని గాని అనుకోటానికి వీల్లేదు.

ఆనాటి చిత్రగాథలు పురాణేతిహాసాలకు చెందినవి. ఆ గాథల్లో బాలపాత్ర ఉంటే వాటికోసం నిర్మాతలు చేతికి అందిన వారిని ఎన్నుకుంటూండేవారు.

ఈ ఎన్నుకోవటంలో మన తెలుగు దర్శకులు కొంత శ్రమపడినట్లే కనుపిస్తుంది. టాకీయుగంలో మూడేళ్లు గడిచేసరికి తొమ్మిది తెలుగు చిత్రాలు మాత్రమే తయారైనవి. 1934 లో "లవకుశ" విడుదలైంది. "లవకుశ" పురాణగాథలోని ప్రధాన పాత్రధారులు భీమారావు, మల్లేశ్వరరావు. వీరిద్దరు మన తొలి బాలతారలని చెప్పాలి.

"లవకుశ" దిగ్విజయం పొందిన చిత్రం. ఇందుకు లవ, కుశ పాత్రధారులే కారకులు. మాస్టర్ భీమారావు, మల్లేశ్వరరావులు తమ పాత్రనిర్వహణతో దక్షిణదేశంలోని ప్రతివ్యక్తికీ సన్నిహితులయారు.

అసలు సినిమాలే అప్పటికి కొత్త. అందులో మాటలు వినిపించే సినిమాలు మరింత వింత; అందులో చిన్నపిల్లలు నటించటం చిత్రాతిచిత్రంగా ప్రజలకు కనుపించేది. అందుచేత తెలుగు ప్రజానీకానికి తొలి బాలతారలు భీమారావు, మల్లేశ్వరరావులు అభిమానపుత్రులయారంటే అతిశయోక్తి లేదు. ఈ ఇద్దరి తారలలో భీమారావంటే ప్రేక్షకులోకానికి మహాభిమానం ఉండేది. ఆ చిత్రంలోని ఇతర నటీనటులంతా వీరిముందు పిగ్మీలై కూర్చున్నారు.

బాలతారలుగల చిత్రాలయుగం 1934 లోనే ప్రారంభమైందని చెప్పవచ్చు. మలి సంవత్సరంలోనే "కృష్ణలీల" తయారైంది. కృష్ణుడుగా మాస్టర్ రాజేశ్వరరావు నటించాడు. ఈ చిత్రానికి కూడా బ్రహ్మాండ

మైన విజయం కలిగింది. రాజేశ్వరరావు నటన, పాట, పురాణపురుషుడైన కృష్ణుని బాల్యజీవిత చిత్రణం ఎంతో చక్కగా ఉన్నందువల్ల ఆ చిత్రం ప్రేక్షకులను ఎక్కువగా ఆకర్షించింది.

ఐతే బాలతారలతో నిండిన చిత్రాలు విజయం పొందుతున్న వని 'లవకుశ' 'కృష్ణ లీల' చిత్రాలు రుజువు చేసినప్పటికి నిర్మాతలు ఆ చిత్రవిజయానికి కారణం స్త్రీ ప్రేక్షకులను ఆకర్షిస్తున్న పురాణ, పతివ్రత, భక్తుల గాథలే అని నిర్ణయానికి వచ్చారు. అటువంటి చిత్రాలనే నిర్మించటానికి పూనుకున్నారు. బాలతారలకుగల ఆకర్షణ, వారికిగల ప్రభావం ఎక్కువమంది నిర్మాతలు గ్రహించలేదు. ఐతే ఒకే ఒక దర్శకుడి దృష్టిమాత్రం బాలతారలపై ఉంటుండేది. ఆయనే సి. పుల్లయ్య. ఈయనను బాలతారల పితామహుడు అనవచ్చు. టాకీయుగం మన దేశభాగంలో ప్రారంభమైన నాటినుంచి స్టేజిమీద పేరుగాంచిన నటీనటులతోనే సంతృప్తిపడకుండా కొత్త ముఖాలకోసం, బాలతారలకోసం దేశాన్ని వేటాడాలనే ఉత్సుకత ఒక్క సి. పుల్లయ్యలోనే ఉన్నదని చెప్పితీరాలి. ఈవిషయం ఆయన నిర్మించిన "సతీ అనసూయ" పిల్లల చిత్రంతో రుజువైంది. ఈ చిత్రం 1936లో విడుదలైంది. ఆ రోజులలో మన దేశానికి ఆంగ్ల టాకీ చిత్రాలు విపరీతంగా దిగుమతి ఔతుండేవి. ప్రతి ఆంగ్లచిత్రంలోనూ ఒక బాలతార ఉంటుండేది. ఆమె షర్లీ టెంపుల్. ఆమె నటించిన చిత్రం "స్టాండ్ అండ్ ఛీర్" అమెరికా ఐరోపా దేశీయులనే కాకుండా భారతీయులను కూడా అధికంగా ఆకర్షించింది. హాలీవుడ్ టాకీయుగ ప్రారంభంలో కోట్లకొలది ప్రజలను టాకీలవైపు మళ్లించిన కీర్తి షర్లీ టెంపుల్‌కి కలిగింది. ఆరేళ్ల ప్రాయంగల బాల తెరమీద చిలకలా పలుకుతూ, నెమిలిపిల్లలా నాట్యం చేస్తూ తప్పటడుగులతో ప్రజలను తన్మయులను చేసింది.

ఇటు ఆంగ్లటాకీలలో షర్లీటెంపులూ, అటు తెలుగు తెరపై "సతీ అనసూయ" లోని పసికందులూ ప్రేక్షకుల్ని గిలిగింతలు పెట్టటంతో బాలతారల దశ మరొక మెట్టు పైకివెళ్లింది. మరుసంవత్సరం 1937 లోనే "సౌతిండియన్ షర్లీ టెంపుల్" ఉద్భవించింది. ఆమెయే బేబీ సరోజ. "బాలయోగిని" చిత్రనిర్మాత, దర్శ

## కొందరు బాలతారలు.



బేబీ శ్యామల

మొదటిచిత్రం "గుణసుందరి";
ప్రస్తుతచిత్రం "మేలుకొలుపు"



బేబీ సరస్వతి

మొదటిచిత్రం "రాణి"; ధర్మదేవత, టింగురంగా, అమ్మలక్కలు, అవ్వయార్, తమిళ దేవదాసు చిత్రాల్లో నటించింది.

బాలతారల ఫొటోలు తీసినవారు జి. యస్. భూషణ్, మద్రాసు.



ప్రసాద్ ఆర్ట్ పిక్చర్సువారి "పెంపుడు కొడుకు"లో బాలనటుడు మోహన్

# ★ చిత్రాల్లో బాలనటులు ★

కులు బాలలతో నడిచే కథను ఎన్నుకుని, బేబీసరోజను తీసుకువచ్చి వెండి తెరకు ప్రసాదించారు. పుల్లయ్యగారికంటె వీరొక ముందడుగు వేశారని చెప్పాలి. పుల్లయ్యగారు పిల్లలను పురాణగాథలకే ఉపయోగించారు; బాలయోగిని నిర్మాతలు బాలలను సాంఘిక చిత్రాలకు ఉపయోగించుకున్నారు.

తెలుగు దేశంలోనూ, తమిళ దేశంలోను "బాలయోగిని" విడుదలై బ్రహ్మాండమైన విజయం సాధించింది. ఇందుకు బేబీ సరోజయే కారణం. ఆ ఏడు బేబీసరోజ చిత్రపటంలేని ఇల్లు దక్షిణదేశంలోను తెలుగుదేశంలోను లేదనే చెప్పాలి. టెలిఫోన్‌లో మాట్లాడుతూన్న బేబీసరోజపటం, వెన్నెలచిందే చిరునవ్వు ధరించిన సరోజపటం ఆరోజులలో ప్రతి ఇంటికీ అలంకరణగా అయింది.

ఐతే "బాలయోగిని"లోని బేబీ సరోజ ఆ చిత్రం తరువాత తెలుగు చిత్రాలలోగాని, తమిళ చిత్రాలలోగాని అంతగా రాణించలేకపోయినప్పటికి ఆ చిత్రం ద్వారా మన కొక తెలుగు బాలతార పరిచయమై, ఆ తరువాత పెద్ద తారస్థాయి నందుకో గలిగిన బాలతార చిత్రపరిశ్రమలో అడుగుపెట్టింది. ఆమెయే ఎస్. వరలక్ష్మి.

మనకు "సతీ అనసూయ ధ్రువవిజయం" చిత్రాలలో పరిచయమైన తారలు కృష్ణవేణి, ఆర్. బాలసరస్వతి, జి. ఎస్. స్వామి, వీరిలో ఆ తరువాత జి. ఎస్. స్వామికి మాత్రం "మార్కండేయ" చిత్రంలో నటించే ఘనత వచ్చింది. కృష్ణవేణి, బాలసరస్వతులు బాల్యదశ అధిగమించినందువల్ల బాలతారలుగా ఉండడానికి వీల్లేకపోయింది. ఐనప్పటికీ బాలసరస్వతికి "ఇల్లాలు"లో వివాహ వయస్సులోని కన్యగా నటించే అవకాశం చిక్కింది. బాలతార కృష్ణవేణి నాలుగేళ్ళ అనంతరం హీరోయిన్ వేషాల దశకు వచ్చినపిదప దర్శనమిచ్చింది.

1939 లో తిరిగి బాలతారల యుగంలో మెరుగు కనిపించింది. ఫస్టు బాలపాత్రను కథలో ఇరికించి, కథను నడిపించిన ఘనత ఆనీడాదిలో బి. ఎన్. రెడ్డిగారికి దక్కింది. "వందేమాతరం" చిత్రంలో అబ్బాయి పాత్ర ధరించిన అమ్మాయి ఉషారాణిని ఆ రోజులలో ప్రజలు అభిమానించారు. ఆనాడు ఉషారాణి మన 'మేరీడోరా' అనుకోవచ్చు. ఐతే ఆ చిత్రంకూడా నాగయ్యా, కాంచనమాలలకు ఇవ్వగలిగినంత లిఫ్టును బాలతారలకు ఇవ్వలేకపోయింది. కారణం బాలలు చిత్రగాథలో కథానాయకుల స్థానం ఆక్రమించక పోవటమే! ఐనప్పటికి 1939 నుంచి వెలువడే సాంఘిక చిత్రాలలో బాలపాత్రలు ఒకటో అరో ఉంటూనే ఉండడం గమనించవలసిన విషయం.

నేటి మదరాసు సుందరి సూర్యకుమారి 1939 లోనే విడుదలైన "రైతుబిడ్డ"లో బాలతార. ఈ చిత్రం ఆమెకు మొదటి తెలుగుచిత్రం మాత్రమే. అంతకుముందు ఆమె బాలనటిగా ఒక తమిళ చిత్రంలో నటించింది. ఈమె నిర్వహించిన పాత్ర బాలదశకూ కన్యదశకుమధ్యనున్న పాత్రకావటం చేత బాలతారగా గొప్ప ఆకర్షణ లేకపోయింది. ఈ విధంగానే సుందరమ్మకూడా "మాలపిల్ల" చిత్రంతో పరిచయమైంది. మరుసటి సంవత్సరమే వీరు బాలతారలదశను అధిగమించారు. 1940 లో వెలువడిన "ఇల్లాలు" చిత్రంలో అనసూయలోని బాలతార బాలసరస్వతి కన్యగా కనుపించింది.

బాలతారలలో విశిష్టతగల యువతిగా జి. వరలక్ష్మి 1940 లో వెండితెరకు పరి



రోహిణీవారి "ప్రతిజ్ఞ"లో బాలనటుడు మధు, తదితరులు

# భరిణ పరీక్ష

**ప్రఖ్యా రాజ్యలక్ష్మి కుమారి**

వయస్సు (12) వేటపాలెం.

పండు వెన్నెలలోన
పసిడి మొగ్గలచెంత
గానమ్ము చేసింది
గేయాల చెల్లాయి.
"ఏమిరా అన్నయ్యా
ఏమిటో చెప్పుకో
చెప్పలేనివాడు
చిరిపోతు మల్లన్న"
అంటూను చేతిలో
అందాలభరిణతో
ననుజూచి నవ్వింది
నాచిట్టి చెల్లాయి.
"చిక్కుకున్నానోయి
చిట్టిచెల్లాయీ,
ఆలోచనాశక్తి
ఆకాశమంటింది."
చెప్పమని కోరాను
చిరునవ్వుతో నేను
"ఓడితివి! ఓడితివి!
ఓచిన్ని అన్నయ్యా
అందాలభరిణయే
అరచేత నున్నాది!
తెలుసుకో! తెలుసుకో
తెలివి గల అన్నయ్యా!"
ఇంతలో మాయమ్మ
చెంత చేరింది
మాబుజ్జి తెలివికి
మురిసిపోయింది.

చయమైంది. అప్పటి కామెకు పదమూడేళ్లు నిండకపోయినప్పటికి "బారిష్టర్ పార్వతీశం" భార్యగా నటించింది. ఆ పాత్ర ఆమెకు పెద్ద ఫీట్. ఐనప్పటికి ఆనాటి కన్య వరలక్ష్మిలో అందాల తారగా చక్కని నటిగా అయే లక్షణాలు కనుపించాయి. మరి రెండేళ్ళకు ఆ వరలక్ష్మియే బాలుని వేషంలో "ప్రహ్లాద"లో తెరపై దర్శనమిచ్చి ప్రేక్షకుల్ని ఆశ్చర్యచకితుల్ని చేసింది. ఒక యువతి ఒక బాలుడిపాత్రను నిర్వహించటం తెలుగుటాకీ యుగంలో ఇది రెండవసారి. "వందేమాతరం"లోని ఉషారాణి ఈ విషయంలో తొలితార. రెండవ "మేరీడోరా" జి. వరలక్ష్మి. నేడు ఈమె మాత్రం కారెక్టర్ యాక్ట్రిస్ బిరుదుపొందే దశకు వచ్చింది!!

తిరిగి "దేవత" చిత్రంలో కొత్త కుర్రవాడు పరిచయమయాడు. "లోకమంతా లోభులా" అని ప్రజానీకొన్ని ప్రశ్నిస్తూ వారి హృదయాలకు హత్తుకున్నాడు దేవతలోని బాలనటుడు. అతడే అశ్వత్థామ. అంతటితో అతని బాలతార దశకూడా ముగిసింది. ఇప్పుడతను రోహిణీ వారి చిత్రాలకు మ్యూజిక్ డైరెక్టర్‌గా ఉంటున్నాడు.

1943 లో "నా వదినా, సుకుమారీ వదినా" అనే పాటతో తెలుగు తమిళ ప్రేక్షకుల్ని "పోతన" చిత్రంలో గిలిగింతలు పెట్టిన తార వనజాగుప్త. ఈమెలో బేబీసరోజా, షర్లీ టెంపుల్ ఆకర్షణలు ఉన్నవని లోకమంతా గ్రహించినప్పటికి ఆమె నుపయోగించుకుంటూ ఏ నిర్మాతా మరోచిత్రం తయారుచేయలేదు.

ఒక్కొక్క చిత్రంతో ఒకేఒక బాలనటి లేదా బాలనటుడు పరిచయమై ప్రేక్షకులను ఇట్టే లాలించి మరోచిత్రంలో తిరిగి వారు కనుపించకపోవటం 1943 వరకు జరిగింది. 1944 నుంచి ఈ విషయంలో మార్పు వచ్చింది. పసిబాలుడుగా కాకపోయినా బాలనటుడుగా చిత్రరంగంలో ప్రవేశించి ఒక్కొక్క చిత్రంలో ఒక్కొక్క మెట్టు ఎక్కుతూ "దేవదాసు"తో అనన్యమైన ఖ్యాతి గడించిన నాగేశ్వరరావు ఆ ఏడాదిలో "సీతారామజననం"లో రాముడుగా నటించాడు. ఇదివరకు అరడజనుమంది బాలనటులను పరిచయంచేసిన కీర్తి అరడజనుమంది దర్శకులకు దక్కినప్పటికీ భవిష్యత్తులో హీరోగా అవతరించగల బాలనటుణ్ణి పరిచయంచేసిన ఘనత ఘంటసాల బలరామయ్యగారికి దక్కింది.

"స్వర్గసీమ" "త్యాగయ్య" చిత్రాలలో మరికొందరు బాలతారలు తెరపైకివచ్చి రంగంనుంచి నిష్క్రమించారు. ఒక్క బాలనటిమాత్రం రంగంలో అడుగునిలిపింది. "యోగివేమన"కు దివ్యజ్ఞానం కలిగించటానికి ఉపకరించిన ఒక ఆయుధంగా చూపబడిన పాత్ర ఒక బాలిక! "జ్యోతి" ఈ పాత్రను బేబీ కృష్ణవేణి ఎంతో ముద్దుగా నిర్వహించి తిరిగి బేబీసరోజను, వనజాగుప్తను జ్ఞప్తికి తెచ్చింది.

"త్యాగయ్య" చిత్రంలో నటించిన ఈ బాలతార తన నటనాశక్తితో "వేమన" నుంచి నిర్మాతలను ప్రజలను మెప్పించగలిగింది.

1947 నుంచి బాలతారలు హీరో హీరోయినుల బాల్యదశ చూపటానికి ఉపయోగించుకోబడ్డారు. ఈ మార్పువల్ల ఈ ఏడాదిలో బాలతారలకు పూర్వంకంటె ఎక్కువ డిమాండ్ రాజొచ్చింది. ఈ మార్పునకు హిందీచిత్రాల ప్రభావమే ఒక కారణం కావచ్చు. అప్పటికప్పుడే విడుదలైన రతన్, లైలామజ్నూ, హిందీచిత్రాలలో నాయికానాయకుల బాల్యదశ ప్రవేశపెట్టటంచేత మరింతగా అవి విజయం పొందినవని మన నిర్మాతలు గ్రహించారనుకోవచ్చు. 1949 లో విడుదలైన మన తెలుగుచిత్రాలలో "లైలామజ్ను" "గుణసుందరి"చిత్రాలలో ఈ ప్రభావం కనుకనుపించింది.

చిన్న లైలాగా నటించిన బాలతార "వేమన" నాటి బేబి కృష్ణవేణియే. మజ్నూగా నటించిన బాలనటుడికికూడా కొంత డిమాండ్ వచ్చిందికాని, కృష్ణవేణికి దొరికిన అవకాశాలు అతనికి దొరకలేదు.

లైలామజ్నూలో ప్రేమికుల బాలదశ చిత్రణకు బాలతారలు ప్రవేశించారు. కాని, ఇంతవరకు తెరపై కనుపించని పాత్రగా మరొకబాలుడు "గుణసుందరి"లో అవుపించాడు. అంజనంవేసే దృశ్యంలో నటించిన మాస్టర్ కుందూని మరచినవారుండరు. కుందూ కే.వి. గారి ఫ్రెండ్. హాస్యధోరణిలో అందెవేసిన చెయ్యిగా తొలిచిత్రంలోనే కుందూ రుజువుచేసుకున్నాడు.

## ★ చిత్రాల్లో బాలనటులు ★

1950 నాటికి పరిశ్రమతో బాటు బాల తారలకుకూడా మంచి భవిష్యత్తు ఉన్న దనే విషయం తేలింది. "పల్లెటూరిపిల్ల" "సంసారం" చిత్రాలలో బాలతారల పాత్రలు బరువుగా ఉన్నవి. చిత్రకథనానికి చిన్నపిల్లలు చేవగొమ్మలుగా తయారయారు. కొత్తకొత్త బాలతారల అన్వేషణ జరిగింది. "పల్లెటూరిపిల్ల" ద్వారా దువ్వూరి కల్పకం, కొమ్మూరి మలికలు, "సంసారం" చిత్రంలో తిరిగి బేబీకృష్ణవేణి ప్రజలను ఆకర్షించారు. "అమ్మా! ఆకలే" పాటతో కృష్ణవేణి ప్రేక్షకులచేకన్నీరు కార్పించింది.

బాలపాత్రలు కథలో ప్రాధాన్యం పొందుతూన్నందువల్ల నైతేనేం, మన చిత్రాలకథలు సహజత్వానికి సన్నిహితంగా రావటానికి యత్నిస్తూండటంవల్ల నైతేనేం బాలతారలు మన చిత్రాలకేకాదు ఇతర భాషాచిత్రాలకుకూడా అత్యవసర మౌతూ వచ్చారు. అందువల్లనే కథకులు, దర్శకులు, నిర్మాతలు చిత్రగాథలో బాలుని పాత్రను విధిగా చేర్చడం అలవరచుకున్నారు. ఈ అలవాటు ప్రకారం 1951 లో "నిర్దోషి"లో మధు పరిచయమయాడు. కాని హిందీ చిత్రనిర్మాతలైన న్యూ థియేటర్స్ వారు బాలతారలను ఉపయోగించుకోవటంలో ఒక విప్లవపరిణామాన్ని దేశానికి రుచిచూపించారు. ఇంతవరకూ బాలపాత్రలు ప్రధానగాధకు కొసరుగా ఉంటూ ఉండేవి; న్యూ థియేటర్స్‌వారు బాలుణ్ణే కథానాయకుణ్ణి చేసి బాలతారల చరిత్రలోను చలనచిత్ర నిర్మాణంలోనూ బ్రహ్మాండమైన మార్పును "ఛోటాభాయ్" చిత్రంతో కలిగించారు. ఈ చిత్రప్రభావం అటు హిందీ, మరాఠీ నిర్మాతలమీద ఇటు తెలుగు, తమిళ చిత్రనిర్మాతలమీద ఎక్కువగా పనిచేసింది. ఈ ఆవేశ ప్రభావఫలితమే ప్రకాశరావుగారి "దీక్ష" చిత్రనిర్మాణం.

"దీక్ష" సంపూర్ణమైన బాలలగాథ. ఒక బాలుని జీవితంలోని అధ్యాయం. అందుచేత "దీక్ష"లో కథానాయకుడు ఒక బాలుడు. అతని చుట్టూ ఉన్న ఇతరపాత్రలు సైడ్ కారెక్టర్స్ అయిపోయాయి. ఇంతవరకు బాలతారలు చిత్రగాథలలో మెరుగుల్లా ఉంటున్నవారు ఈ చిత్రంతో ఒక్కసారి ఆజానుబాహులయారు. "దీక్ష"లో రాంగోపాల్ ఈ అంతస్థును అందుకున్న తొలి బాలహీరో. ఆ చిత్రంలో సుధాకర్ ఇంకా ఇతర బాలనటుల్లో మాస్టర్ కుందూ కూడా ఉన్నారు.

ఈ ఏడాదిలోనే వాహినీవారు అసమానమైన చిత్రం నిర్మించారు. అదే "మల్లీశ్వరి." అందులో బాలమల్లిగా బేబీమల్లిక బాలనాగరాజుగా రఘురామమూర్తి చాల చక్కని బాలతారలుగా మనకు పరిచయమయారు.

1952 లో పూర్తిగా బాలతారలే చిత్రపరిశ్రమను పరిపాలించారని చెప్పాలి. ఇందుకు "పెళ్లిచేసిచూడు" చిత్రం కారణం. ఈ చిత్రం తెలుగు పరిశ్రమకు రెండువిధా

లుగా వెలుగును ప్రసాదించింది. బాలతార లకు పరిశ్రమలో భద్రత భవిష్యతు లు స్థిరంగా ఉన్నవని నిరూపించిందాచిత్రం; అంతేకాకుండా హాస్యసాంఘికచిత్రాలకే కరువైన మనదేశానికి ఉత్కృష్టమైన హాస్య చిత్రనిర్మాణానికి బాట ఏర్పరచింది. కూసర్ కుందూ, కందా మోహన్, బేబీ గిరిజ ఈ చిత్రంతో ఫస్ట్‌రేట్ బాల తారలై కూర్చున్నారు.

జూనియర్ శ్రీరంజని బాలతారగానే సినిమాలలో ప్రవేశించినప్పటికీ ఆమె నటించిన చిత్రాలలోని ఆ పాత్రలు చాలా అప్రధానమైనవి కావటంచేత బాలతారగా ఆమెకేమీ న్యాయం జరగలేదు. "సతీ తులసి" "మార్కండేయ" "నరనారాయణ" చిత్రాలలో కనుపించిన బాలతార జూనియర్ శ్రీరంజనియే. ఐతే ఆమెకు తారగా ఖ్యాతి, కీర్తి సంపాదించిపెట్టిన చిత్రం "గుణసుందరి కథ."

"పల్లెటూరు"లో నటించిన టి. జి. కమలాదేవికూడా బాలతారగానే చిత్ర రంగంలో ప్రవేశించింది. "తెనాలిరామలింగ"లో ఈమెను హెచ్. ఎమ్. రెడ్డి పరిచయం చేశారు.

ఇంతకంటె విచిత్రమైనదీ, విశిష్టతగలదీ ఏదంటే శివరావు సినిమా ప్రవేశం. శివరావు సైలెంట్ చిత్రాల కాలంలో అంటే 1922 లో "భక్త మార్కండేయ" అనే మూగ చిత్రంలో నటించాడు. అప్పటికి శివరావు వయస్సు 9 ఏళ్లు. నేటి తెలుగు బాలతారలందరికీ పితామహుడు శివరావేనని చెప్ప వచ్చు. తిరిగి అతడు టాకీయుగంలోకివచ్చి 1932 లో "చింతామణి"లో నటించే టప్పటికి బాలతార దశను మించిపోయాడు.

"సుమంగళి" "దేవత" చిత్రాలలో హీరోయిన్‌గా నటించికీర్తిగాంచిన కుమారి కూడా ఆమె తొలిచిత్రం "దశావతారాలు" నాటికి బాలతారయే మాలతికూడా "ఉషా పరిణయం"లో బాల ఉషగా నటించింది.

1953 లో కూడా బాలతారలే చిత్రపరిశ్రమపై ఆధిక్యం వహిస్తున్నారు. "దేవదాసు" "నాయిల్లు" "కన్నతల్లి"లోని సుధాకర్ ఆంధ్రప్రేక్షకులకు అభిమాన తార అయాడు. ఈ సంవత్సరంలో యావద్భారత చలనచిత్ర పరిశ్రమాన్ని బాలల కథలే పరిపాలిస్తున్నవని చెప్పకతప్పదు. గతసంవత్సరంలో వచ్చిన ఈ మార్పు ప్రశంసాపాత్రమైనది. హిందీ మరాఠీ భాషలలో తయారైన "నన్నే ముసే" చిత్రవిజయం ఇతర నిర్మాతలకు కనువిప్పు అయింది. ప్రస్తుతం చాలా మరాఠీచిత్రాలగాథలలో బాలలేకథా నాయకులుగా ఉంటున్నారు. నిజమైన బాలతారలయుగం మనదేశంలో గత సంవత్సరంలోనే ప్రారంభమైందని చెప్పాలి. ముఖ్యంగా మరాఠీ చిత్రపరిశ్రమ ఈ నూతన పరిణామానికి నాందిపెట్టింది. హిందీ చిత్రపరిశ్రమ అసహజమైన ప్రణయగాథలతో అధోగతి పాలౌతున్న సమయంలో మరాఠీ చిత్రదర్శకుడు దత్తా ధర్మాధికారి పిల్లలగాథను తెరకు అందించి దిగ్విజయం పొందాడు. ఇతర నిర్మాతలు ధర్మాధికారి విజయానికి కారణం ఏమిటో శల్యపరీక్ష చేసుకోవటం ప్రారంభించారు. జీవితానికి సన్నిహితంగా ఉండే సమస్యలనే, అవి స్వల్పమైనవైనా, ఘనమైనవైనా వాటినే తెరకు అందించాలని నేటి ప్రేక్షకుడు కోరుతున్నాడనే యధార్థాన్ని ధర్మాధికారి గ్రహించినపిమ్మట ఇతర నిర్మాతలు అర్థం చేసుకున్నారు.

సంఘంలో, దేశంలో, కుటుంబంలో పిల్లలకు ఎదురయే సమస్యలగురించి గాథలను అల్లి చలనచిత్రాలుగా తయారు చేయటంలో మరాఠీ నిర్మాతలు ముందడుగు వేశారు. తత్ఫలితంగా "దూద్ భాత్" "దేవ్ బప్పా" "వహీనా చీబాంగడియా" అనే చిత్రాలు వరుసగా వెలువడి అపార విజయం సాధించినవి. ఈ గాథ లన్నిటిలోనూ బాలలే ప్రధాన పాత్రలు.

ఐతే భారతదేశ చిత్ర నిర్మాతలలో ఒక్కసారిగా ఈ మార్పు కలగటానికి ముఖ్యంగా రెండు కారణాలు ఉన్నాయి. 1952 లో మన దేశంలోని నాలుగు ముఖ్య పట్టణాలలో జరిగిన అంతర్జాతీయ చలనచిత్ర మహోత్సవంలో ప్రదర్శింపబడిన అద్భుత చిత్రాలు మన నిర్మాతలకు నిరోసం కలిగించటం మొదటి కారణం. మొత్తం భారతదేశంలో దిక్కూ మొక్కూ లేకుండా ఎదుగూ బొదుగూ లేకుండా ఉన్న మరాఠీ చిత్రపరిశ్రమలోని వారికి బాలల చిత్రాలు విజయసాధనాలుగా కనుపించాయి. ఇది రెండవ కారణం. దీనితో మరాఠీ చిత్రనిర్మాతలు బాలల చిత్రాల విషయంలో ఇతరులకు మార్గదర్శకులయారు.

విజయం పొందిన చిత్రాలన్నీ శల్యపరీక్ష చేసి వాటిని అనుసరించటమే మన దేశ నిర్మాతలకు ఒక పెద్ద అలవాటు. ఆ

# బంగారు వాన

ఆంధ్ర నరసింహమూర్తి, (13) అనకాపల్లి.

నేను ఒక్క మేఘాన్నై
పర్వతాల తాకుతాను.
లోయలనూ దాటుతాను
ఆకాశపు వీధులలో
మెరిసే చుక్కలరథమున
స్వారిచేయు నెలబాలుని
నెమ్మదిగా తాకెదను.
నీలిరంగు దాల్చెదను.
ధగధగ నే మెరసెదను.

నరుల ఘోష వినలేకను
చెరువులలో నదులలోన
నీరమునై రాలుతాను.
పంటల పండించుతాను.
ఋతువుల సృజియిస్తాను
కవుల వర్ణనల వింటాను.
రైతుల ప్రార్థన వింటాను.
నేను రాకపోయానో,
కరువు బయలు దేరిందో,
షికారుగా నేనొస్తే
నన్నాహ్వానిస్తారు.
నే నలాగ వస్తానా?
నాకాలం వచ్చిందా,
నేను వచ్చి కురుస్తాను.
లోకమునే రక్షిస్తాను.
అందుకనే నాపేరు,
"బంగారువాన."

# మరద[illegible]

రచన కె. సూర్యకాంత (12) నారాయణపేట

ఎండమండి వస్తిరో, ఏదోవ నొస్తిరో,
కూర్చోమందామంటె, కుర్చీ లేదు
దాహంబునైనాను, ఇప్పించుదామంటె
కొల్లపచ్చులు రెండు దొరుకలేదు
నీరు మజ్జిగైనాను, ఇప్పించుదామంటె
నిమ్మకాయలు రెండు, దొరుకలేదు
అన్నంబు కూరలూ, పెట్టించుదామంటె
ఇంటివారూ లేరు, వంటలేదు
మీరు పోయేదోవలో, మాసత్రముంది
మాపేరు చెప్పకొని భోంచేసి పొండి
మళ్లి వచ్చేటపుడు, మల్లెమొగ్గలచీర మరవకండి

## చిత్రాల్లో బాలనటులు

అటు ప్రకారం, ఇతర ప్రాంతీయులకు కూడా బాలల, గానలపై, మోజు కలిగింది ఈ మోజును పెరిగేలా పుట్టించిన చిత్రాలు రెండున్నవి ఒకటి జపాన్‌నుంచి వచ్చిన "యూకివారీసా", రెండవది ఇటలీనుంచి దిగుమతి అయిన "బైసికిల్ థీఫ్" ఈ రెండు చిత్రాలపై భారత ప్రేక్షకులు అపారమైన ప్రశంసల వర్షం కురిపించారు "యూకివారిసా"లో కథానాయకుడు ఐదేళ్ళ పసిబాలుడు "బైసికిల్ థీఫ్"లో కూడా కథను నడిపించిన పాత్రల్లో పిల్లవాడే ప్రధానుడు ఈ ఏడాదిలో విడుదలైన "బూట్‌పాలిష్" చిత్రంలో కూడా కుర్రవాడే ప్రధానపాత్ర కావటం ఆ చిత్రం కూడా ప్రజాభిమానం పొందటంవల హిందీ చిత్రనిర్మాతలు తమ గాథలలో బూట్‌పాలిష్ కుర్రవాళ్ల పాత్రలను ఎన్నుకోవటం జరిగింది.

ఐతే మన తెలుగు చిత్రపరిశ్రమలో మాత్రం బాలతారల చిత్రాల గిరాకీ ఫలితాలు కనిపించటంలేదు ఒక బాలుడు లేదా బాలికయే ప్రధానపాత్రగల గాథలను మరాఠీ హిందీ చిత్రనిర్మాతలు ఎన్నుకున్నప్పటికీ మన తెలుగులో ఇంకా అంతటి అభ్యుదయం చొరబడలేదు మనవాళ్లు ఇకముందు ప్రారంభించినప్పటికి మన తెలుగు ప్రేక్షకులు అటువంటి చిత్రాలను ఇతర భాషలలో చూసి ఉండటం జరుగుతుంది ఇందుకు ముఖ్యకారణం మన చిత్రనిర్మాణ కనీస వ్యవధి సంవత్సరం కావటమే ఒక ఏడాది కాలేటప్పటికి ప్రేక్షకులలో నూతన అభిరుచులు ఉద్భవిస్తాయి దానిని నిర్మాతలు అరికట్టలేరు మూడు, నాలుగు నెలలకొక చిత్రం తీయగల వేగానికి అలవాటుపడిననాడే మన తెలుగు చిత్రపరిశ్రమకు ఉజ్జ్వలమైన భవిష్యత్తు ఉంటుంది

ఈ ఏడాదిలో ప్రకాశరావుగారు, బి ఏ సుబ్బారావు గారు తయారు చేస్తున్న "బూరెల మూకుడు" వగైరా చిత్రలు, "రాజా-పేదా" చిత్రంవల్ల బాలతారల నటనా ప్రతిభ మరింతగా ద్యోతక మవుతుంది

గత రెండేళ్లుగా, బాలలకు చిత్రపరిశ్రమ ప్రవేశంపై గతంలోలేని మోజు కలిగింది బాలబాలికలలో నటులు ఉన్నారు, అందమైనవారున్నారు చిత్రాలలో నటించాలనే సరదా లేని బాలలు మాత్రం లేరు

నేటి తెలుగు పరిశ్రమలో చొరబడిన తాజా బాలతారలలో రెండు రకాలవారున్నారు సినీ నటన "హాబీ"గా ఎన్నుకున్న బాలలు, వృత్తిగా ఎన్నుకున్న బాలలు ప్రస్తుతం మన పరిశ్రమలో మొదటి తరగతివారే ఎక్కువమంది ఉన్నారు వారంతా ధనవంతుల బిడ్డలు వారికి తాము చిత్రాలలో నటిస్తే చాలు, డబ్బుతో పనిలేదు.

మదరాసులో ఉన్న టాలెంట్ "బాల" పత్రికా సంపాదకులద్వారా చాల భాగం చిత్రనిర్మాతలకు అందుతున్నది బాలనటులు నేటి చిత్రపరిశ్రమను ఉద్ధరించగల రనే ఆశ కనిపిస్తున్నది అందువల్ల దేశంలో ఉన్న బాలబాలికల టాలెంట్‌ను వేటాడినట్లయితే మరికొందరు దొరుకుతారు

చిత్రపరిశ్రమలో బాలలు చేరటానికి చంకలు చరుస్తారు కాని, ఇదే వారికి శాశ్వత జీవనోపాధిగా ఉంటుందనేది కల్ల బాల్యదశ గడిచిన పిదప కూడా చిత్రరంగం వృత్తిగా ఎన్నుకోదగిన అర్హత సంపాదించేవాళ్లు చాలా తక్కువ ఉంటారు. చిన్నతనంలో ఏ ప్రాణియైనా మతాబాలా వెలిగి ఆరిపోయే స్థితి అనుభవించటం మంచిది కాదు ఈ విషయంలో నిర్మాతలతోబాటు బాలల గార్డియనులు కూడా శ్రద్ధ వహించవలసి ఉంది

పాశ్చాత్యదేశాలలో ముఖ్యంగా హాలీవుడ్‌లో చలన చిత్రాలలో బాలలు నటించటప్పుడు కొన్ని షరతులను ప్రభుత్వమే ప్రవేశపెట్టింది పసిపాపలను, ఫ్లడ్‌లైట్ల క్రింద కొన్ని సెకనులు మాత్రమే ఉంచాలని, ఐదేళ్ళ బాలుడు, పై వయసువాళ్లు షూటింగ్, లైట్లక్రింద కొన్ని గంటలు మాత్రమే పనిచేయాలనే నిబంధనలు ఉన్నవి పసికందును నిర్మాతలు ఉపయోగించుకోవాలంటే సెట్ మీద నిర్మాతలు ఒక నర్సును నియమించాలి షాట్ తీసిన తరువాత పసిపాపకు నర్సులు కొన్ని ఉపచర్యలు చేయాలి బాలల విషయంలో ఆరోగ్యం, విద్యలు ప్రధానమైనవి కాని, వృత్తి కాదు అందుచేత ఈ రెండు విషయాలలో మన నిర్మాతలు కూడా కొన్ని నిబంధనలను ప్రవేశపెట్టి బాలతారల ఆరోగ్యం, విద్యా విషయాల్లో శ్రద్ధ వహించాలి ★

Edited, Printed & Published by S Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madras



నీటిలో ఆట —ఫొటో : పి. జనార్దనరావు, మద్రాసు.

# ఆంధ్ర ప్రజానీకానికి మా ప్రచురణలు

ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక ద్వారా ఆంధ్ర ప్రజానీకమునకు
పరిచయము చేసిన యీ క్రింది ప్రచురణలు మావద్ద
చిల్లరగాను, టోకుగాను దొరకును.

| | | |
|---|---|---|
| రాజూ పేద | (మార్క్‌ట్వేన్) | **2-0-0** |
| టామ్‌సాయర్ | ( ,, ) | **2-0-0** |
| హకల్‌బెరిఫిన్ | ( ,, ) | **2-0-0** |
| విచిత్రవ్యక్తి | ( ,, ) | **1-8-0** |
| కాంచనద్వీపం | (స్టీవెన్సన్) | **1-8-0** |

పై ఐదింటికిఅనువాదం: నండూరి రామమోహనరావు

ఆలీబిల్లీలోకంలో అమ్మాయికథ **1-0-0**
(లూయీకెరోల్) అనువాదం : వి. డి. ప్రసాదరావు

కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో (అలెగ్జాండర్ డ్యూమా)
(రెండుభాగములు) ఒక్కొక్క భాగము **3-8-0**
అనువాదం : సూరంపూడి సీతారామ్

డాన్ క్విక్‌సెట్ మూలం : సెరివాన్‌టెజ్
(అనువాదం) విశ్వాత్ముల నరసింహమూర్తి, **2-0-0**

రెండు మహానగరాలు (తెన్నేటి సూరి) **3-0-0**

ఆత్మకథ రెండుభాగములు (మహాత్మాగాంధీ)
ఒక్కొక్కభాగం **5-0-0**

శ్రీమద్భగవద్గీత (కా. నాగేశ్వరరావుపంతులు) **4-0-0**

ఆంధ్రవాఙ్మయ చరిత్ర **2-0-0**

శ్రీ మదాంధ్ర మహాభారతము
ఉద్యోగపర్వము **1-0-0**

బసవపురాణము (పాల్కురికి సోమనాథకవి) **4-0-0**

---

ఆంధ్రగ్రంథమాల, మదరాసు 1.